# వివాహ ప్రకరణము

**కుజదోషం**

వధూవరుల జాతకములలో కుజుడు 2-4-7-8-12. ఈ స్థానములలో నుండిన యెడల కుజదోషము. ఆ దోషము పురుషునకు భార్యావియోగము. స్త్రీకి భర్తృవియోగమును కలుగచేయును.

కటక సింహ రాశులలోను, మకర రాశి యందును, కుజునికి మిత్ర క్షేత్రములందును జన్మించిన వారికి ఈ కుజ దోషం లేదు.

కుజుడు రెండవ స్థానమునందుండెడి కుజదోషము మిధున కన్యలలో నుండునప్పుడు లేదు. అదేవిధంగా 12వ స్థానము వృషభ, తులలైనను, నాల్గవ స్థానము మేష వృశ్చికములైనను, ఏడవ స్థానము మకర కర్కాటకములైనను, అష్టమ స్థానము ధనుర్మీనములైనను కుజదోషము లేదు.

కుజుడు బృహస్పతితో చేరినప్పుడును, చంద్రునితో బుధునితో చేరినప్పుడును కుజదోషము లేదు.

వధూవరులకు పైనచెప్పినట్లు 2-4-7-8-12 ఈ స్థానములలో ఉభయులకు కుజుడుండిన యెడల దోషము లేదు. దీర్ఘకాలం దాంపత్య సుఖము అనుభవించి పుత్రారామ ధన క్షేత్రాదులతో సుఖింతురు. ఒకరి జాతకమందే యుండిన యెడల కష్టనష్టములు కలుగును. ఇట్లని దేవ కేరళమందు చెప్పబడినది.

పురుషులకు 2-12 యందును స్త్రీలకు 4-7 యందును ఉభయులకు అష్టమమందును కుజుడుండెనేని కుజ దోషము తప్పదని పెద్దల అభిప్రాయము.

**యోని వైరం**

పిల్లి- ఎలుక, ఏనుగు-సింహం, ఆవు- పులి, కోతి-మేక, పాము - ముంగిస, కుక్క-లేడి, గుర్రం- ఎనుబోతు ఇవి పరస్పర విరోధ జంతువులుగా భావించాలి.

**ఏకనక్షత్రం**

కృత్తిక, రోహిణి, ఆర్ద్ర, మఖ, పుష్యమి, చిత్త, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి ఇవి వధూవరులకు ఇద్దరికీ ఒకే నక్షత్రమైతే శుభమే.

భరణి-మృగశిర- ఆశ్లేష-హస్త- ఉత్తరాషాఢ-శతభిషం ఇవి ఏక నక్షత్రం కాకూడదు. మిగిలినవి మధ్యమం. ఇద్దరిదీ ఒకే రాశి అయినప్పుడు వేర్వేరు నక్షత్రాలు, వేర్వేరుపాదాలు అయితే మంచిది..

**ఏకనాడి**

అశ్విని, మూల, ఆర్ద్ర, పునర్వసు, పూర్వాభాద్ర, శతభిషం, ఉత్తర నక్షత్రాలకు ఆదినాడి అయినప్పుడు ఏకనాడి దోషం లేదు.

మృగశిర, పుబ్బ, చిత్త, పుష్యమి, ధనిష్ఠ, అనూరాధ, పూర్వాషాఢలకు మధ్యనాడి అయితే ఏకనాడి దోషం లేదు. ఆర్ద్ర, స్వాతి, విశాఖ, రోహిణి, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రాలకు అంత్యనాడి ఒకటే అయినా ఏకనాడి దోషం లేదు.

**దోషగుణం**

ఆశ్లేష, చిత్త, విశాఖ జేష్ఠ, మూల, శతభిషం నక్షత్రాలలో జన్మించినపుడు స్త్రీలకు రాక్షస గుణదోషం వర్తించదు. అంతే గాక రాశి యోని, గ్రహమైత్రి నాడి ఇవి సహజ శుభంగా వున్నప్పుడు గాని ఏకాధిపత్యమైనప్పుడు గాని స్త్రీలకు రాక్షస గణదోషం వర్తించదు. పరిహారంతో అనుకూలించగలవు. రాశికూటాదులలో 19 గుణములకంటే ఎక్కువ వస్తే శుభం.

**వివాహ విచారణ**

దినం- వధువు నక్షత్రం నుండి వరుని నక్షత్రం వరకు లెక్కించి ఆ సంఖ్యను 9తో భాగించగా శేషం 2-4-6-8-0 వస్తే శుభం.

మహేంద్రం- వధూనక్షత్రం నుండి వర నక్షత్రం 4,7,10,13, 16,19,22,25 శుభం

స్త్రీ దీర్ఘం - వధూ నక్షత్రం నుండి వర నక్షత్రం 13 కంటే ఎక్కువైతే అనుకూలం.

యోని - ఏకయోని మంచిది. ఏకలింగం ఉత్తమం. శత్రుయోని ప్రతికూలం.

రాశి - ఏకరాశి, సమసప్తకం అనుకూలం, రాశి అధిపతులకు మైత్రి వుంటే మంచిది, శత్రుత్వం వుండకూడదు.

నాడి - ఏకనాడి, ఏక రజ్జు, పరస్పర వేధ ప్రతికూలం.

| -స్త్రీ రాశి నుండిప | ృరుషరాశి |
|---|---|
| 2-12 మృత్యువు | 12-2 ఆయుష్యం |
| 3-11 దుఃఖం | 11-3 సుఖం |
| 10-4 విరోధం | 4-10 ప్రీతి |
| 9-5 వైధవ్యం | 5-9 సౌభాగ్యం |
| 6-8 కలహం | 8-6 ప్రీతి |

సమ సప్తకములకు సింహ కుంభములు, మకర-కర్కాటకములు తప్ప మిగిలినవి అనుకూలం. 2-12 మీన-మేషాలు, వృషభ-మిధునాలు, కర్కాటక-సింహాలు, కన్యా-తులలు, వృశ్చిక-ధనుస్సులు, మకర -కుంభములు అనుకూలం.

3-11 కటక-వృషభాలు, కుంభ-ధనుస్సులు, మకర-మీనాలు అనుకూలం.

10-4 మేష-కర్కాటాలు, కుంభ-వృషభాలు, మిధున-కన్యలు, సింహ-వృశ్చికాలు, తుల-మకరాలు, ధనూ-మీనాలు అనుకూలం.

**వివాహమునకు ఉపయుక్తములగు రాశికూటాదుల విషయములు**

రాశి కూటాదులు స్త్రీ రాశి మొదలుకొని పురుష రాశి వరకు లెక్కించవలయును.

పనికివచ్చే ద్విర్ద్వాదశము - మీ-మే, వృష-మి, కట-సిం, కన్య-తు, వృశ్చి-ధను, మక-కుం వీటిలో 2-12 అయిన శుభము. ఏకాదశ త్రికాలకు - కట-వృష, కుం-ధను, మకర-మీనములు వీటిలో 3-11 అయిన శుభం మిగిలినవి అశుభం.

దశ చతుర్థాలకు - మే-కట, కుం-వృష, మిధు-కన్య, సిం-వృశ్చి, తుల-మక, ధను-మీనములు శుభములు మిగిలినవి అశుభములు.

నవ పంచములకు - మిధు-కుంభ, మకర-కన్య, మీన-వృశ్చికములు శుభములు, మిగిలినవి అశుభములు.

షష్టాష్టకములకు - మేష-వృశ్చి, కట-ధను, సింహ-మీనం, కుంభ-కట, మక-మిధున, తుల-వృషభము ఇవి శుభములు, కన్య-కు, సిం-మీనములు అశుభములు.

సమసప్తకములకు - సిం-కుంభ, మక-కట తప్ప మిగిలినవి శుభములు..క

నక్షత్ర విషయం - భర, మృగ, ఆశ్లే, హస్త, ఉషా,శత ఈ నక్షత్రములు దంపతులకి ఒకటైన పనికి రావు. కృ, రో, ఆర్ద్ర, మఖ, పుష్య, చిత్త, శ్ర, ఉభా, రేవ ఇవి దంపతులకు ఏకమైన శుభం. మిగిలినవి మధ్యమం. దంపతులవి ఒకే రాశి అయిన యెడల భిన్నపాదం, భిన్న నక్షత్రం అయిన యెడల శుభం..

ఏకనాడి విషయం - ఉత్తర, శత, పూభా, పున, ఆర్ద్ర, మూల, అశ్విని ఈ నక్షత్రములందు ఏక ( ఆది) నాడి దోషం లేదు.

మధ్యనాడి విషయం - పూషా, అనూ, ధని, పుష్య, చిత్ర, పూఫ, మృగ ఇవి మధ్యనాడి అయిన దోషము లేదు.

అంత్యనాడి విషయం - ఉభా, రే , రో, స్వా, విశా, ఆర్ద్ర, ఈ నక్షత్రములందు అంత్య నాడి దోషం లేదు.

**పనికివచ్చే రాక్షస గణ నక్షత్రములు**

ఆశ్లేష, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, శతభిషం ఈ నక్షత్రాలలో స్త్రీ రాక్షసమైనను దోషం లేదు. ఏకాధిపత్యమైనను రాశి యోని గ్రహ మైత్రం నాడి ఇవి సహజముగా శుభముగానున్నను, స్త్రీలకు గల రాక్షస గణము దోషం లేదు. పరిహారముచే పనికివచ్చును. రాశి కూటాదులకు 19 గుణములకన్న అధికముగానున్న శుభము.

**వివాహ విషయము**

శుభకార్యాలన్నింటిలో వివాహము చాలా ముఖ్యమైనది. దంపతులు ఒకరినొకరు చూచుకున్న వేళ (సమయము) ను బట్టి శుభాశుభ ఫలితములు జరుగుచుండును. వారిద్దరి జన్మ (లేక) నామ నక్షత్రములను మట్మియు జాతక కుండలీలను బట్టియు మంచి చెడ్డలు తెలుసుకొని వివాహము చేయుట మంచిది. కుజ దోషము ముఖ్యముగా చూడదగినది.

**వివాహమునకు శుక్ర దోషము**

శుక్రుడు పురుష జాతకమునకు కళత్రకారకుడుగను, స్త్రీ జాతకమునకు బర్తృకారకుడుగను వుండుటచే 6-8-12 స్థానముల యందుండి, పాపగ్రహముల యొక్క సంబంధమయినను లేక దృష్టియయినను పురుష జాతకమందున్నచో, స్త్రీకిని, స్త్రీ జాతకమందున్నచో పురుషునికి దోషము సంభవించును. ఈ పురుష స్త్రీలకిద్దరికి ఇట్లుండినను లేకుండినను శుభమే యగును.

**జన్మరాశి - నామరాశి విచారం**

వరుని జన్మ నక్షత్రమున్ను, కన్య జన్మ నక్షత్రమున్ను చూచుట శ్రేష్ఠము కన్యకు జన్మ నక్షత్రము లేనిచో వరునికి జన్మ నక్షత్రము కన్య నామ నక్షత్రము చూడవచ్చును. వధూవరులకు ఇద్దరికీ జన్మ నక్షత్రములు లేనిచో నామ నక్షత్రములను చూడవలయును, ఇదియు విరుద్ధమైన కన్యానామమును పునః పెట్టవలయును గాని దీనికి భిన్నము కాకూడదు.

దేశ, గ్రహ, గృహ, జ్వర, వ్యవహార, దాన, మంత్ర, రాజసేవ, యుద్ధ పునర్వివాహాది కార్యములకు నామరాశి ప్రశస్తము, వివాహాది శుభ కార్యములన్నింటికిని జన్మరాశి శ్రేష్ఠమైనది.

**వివాహ ఫల వివరణ చక్రం (వివాహలగ్నాత్)**

వివాహలగ్నంనుండి ఏభావాలలో (స్థానాలలో) ఏగ్రహాలు అనుకూలామో, ఏస్థానాలలో ప్రతికూలామో ఈదిగువపట్టికలో గ్రహాలకు ఎదురుగా స్థానాలసంఖ్యలు సూచిస్తాయి.

| గ్రహం | అనుకూలం | ప్రతికూలం |
|---|---|---|
| రవి | 3,6,8,9,11 | 7,1,2,4,5,10,12 |
| చంద్ర | 2,3,9,11 | 7,1,4,5,6,8,10,12 |
| కుజ | 3,6,11,9 | 7,8,1,2,4,5,10,12 |
| బుధ | 1,2,3,4,5,6,9,10,11,12 | 7,8 |
| గురు | 1,2,3,4,5,6,9,10,11,12 | 7,8 |
| శుక్ర | 1,2,3,4,5,9,10,11,12 | 7,8,6 |
| శని | 3,6,8,11 | 7,1,2,4,5,9,10,12 |
| రాహు | 6,11 | 7,8,1,2,3,4,5,9,10,12 |
| కేతు | 3,6,11 | 7,8,1,2,4,5,9,10,12 |

**చక్రము - ఫలము**

| | | |
|---|---|---|
| ఈశాన్యం | పూర్వం | ఆగ్నేయం |
| సకల సంపదలు | శుభము | వంశహాని |
| ఉత్తరం | మధ్య | దక్షిణం |
| ధనము / ధాన్యము | దంపతులకు మరణము | వైధవ్యం |
| వాయువ్యం | పశ్చిమం | నైరుతి |
| స్త్రీ వ్యభిచారిణి | రుణంవ్యాధి | వంశవృద్ధి |

నిలువుగా నాలుగు రేఖలను అడ్డముగా నాలుగు రేఖలను లిఖింపగా తొమ్మిది గడులు గల వివాహ చక్రమేర్పడును. ఆ చక్రమునందు సూర్యుడున్న నక్షత్రము మొదలుకొని, మధ్యం, ప్రాక్, ఆగ్నేయాది క్రమముగా గదికి మూడు నక్షత్రముల చొప్పున గదులను( 9ని3చే హెచ్చించుగా 27) నక్షత్రములు లభించవలయును, అప్పుడు చంద్రుడున్న నక్షత్రము అనగా వివాహ ముహూర్త కాలిక నక్షత్రము, ఏ దిక్కున గదిలో నున్నదో తెలుసుకొనవలయును. ఆ దిక్కున ఏ ఫలను ఏ ఫల చక్రమున చూపబడినదో చూడుము. అది శుభఫలమేనని, ఆ నక్షత్రమున వివాహము శుభప్రదము.

**జన్మ నక్షత్రమందు చేయతగిన కార్యములు**

నిషేకము, యాగము, చౌలము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, పట్టాభిషేకము, భూసంపాదనము, అక్షరాభ్యాసము ఇట్టి కార్యములు చేయవచ్చు).

**వివాహ లగ్నాత్ గ్రహఫల చక్రం -శ గ్రహములు శుభులుగా నుండి తీరవలెను (ష్ఠ) అపైన ఎన్ని గ్రహములు శుభులైతే అంత మంచిది. ఏకవింశతి మహాదోషములను విడువవలెను.**

| గ్రహ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | మృత్యు | నష్టం | ధనం | హాని | వ్యాధి | సౌఖ్యం | వైధవ్య | ఆయు | కష్టం | స్వాద్రో | లాభం | బాధ |
| చంద్ర | నాశః | సంపత్ | యశః | బంధు వృద్ధి | పుత్ర లాభ | మృత్యు | సపత్ని త్రిప్తుడు | సన్యాసం | సంతాపం | భోగం | భాగ్యం | వాస్యం |
| కుజ | మృత్యు | శోకం | ధనం | విరోధు | బుద్ధి | లక్ష్మీ ప్రాప్తి | మృతి | నాశం | ద్వేషం | వ్యసను | పుత్ర | దుఃఖం |
| బుధ | ప్రీతి | ధనం | జయం | సుఖం | పుత్ర | శత్రుత్వం | పుత్రహాని | వైధవ్యం | భాగ్యం | రాజ్యం | ఆయు | హాని |
| గురు | ధనప్రాప్తి | కీర్తి | ప్రీతి | వైరి | ఇష్టప్రాప్తి | ధనం | నాశం | పాపం | భాగ్యం | రాజ్యం | సౌఖ్యం | శతృవృద్ధి |
| శుక్ర | భోగం | వైభవం | విరోధం | ఉన్నతి | కీర్తి | విఘను | రోగం | మృత్యు | ప్రీతి | రాజ్యం | లాభం | వ్యయం |
| శని | కలహం | హాని | కీర్తి | భయం | రోగం | ధనం | మరణం | సుఖం | నష్టం | వ్యసనం | భోగం | రోగం |
| రాహు | కలహం | హాని | కీర్తి | భయం | రోగం | ధనం | బంధనం | సుఖం | నష్టం | వ్యసనం | భోగం | రోగం |
| కేతు | కలహం | హాని | కీర్తి | భయం | రోగం | ధనం | బంధనం | సుఖం | నష్టం | వ్యసనం | భోగం | రోగం |

**జన్మ నక్షత్రము - అనుకూల ప్రతికూల తారలు**

**చంద్రబలం**

మేషం నుంచి మీనం వరకు గల 12 రాశులలో మీ జన్మ తార గల రాశిని అనగా జన్మ రాశిని మొదటి రాశిగా భావించాలి. మీ జన్మరాశి నుండి లెక్కించి నప్పుడు 1-3-6-7-10-11 రాశులలో గల నక్షత్రాలపై చంద్ర సంచారం జరిగే రోజులు మీకు అనుకూలం. అవి చంద్ర బలం గల నక్షత్ర దినాలు. అయితే మీ జన్మ రాశి లోను, అక్కడి నుండి 3-7-10-11 రాశులలో వున్న నక్షత్రాలలో కొన్ని మీకు ప్రతికూలమైనవి కూడా వున్నాయి. వాటికి తారాబలం వుండదు.

**తారాబలం**

1వ నక్షత్రం అశ్విని నుండి రేవతి వరకు గల 27 తారలను 9 వరుసలుగా విభజించండి. అప్పుడు అడ్డువరుసలలో వరుసకు 3 నక్షత్రాలు వస్తాయి. వి ఒక వర్గానికి (గ్రహానికి) చెందినవి. 1.అశ్విని 10. మఘ 19మూల అవి ఒకే వర్గానికి చెందిన తారలు. అలాగే మిగిలిన 8 వరసలలో మూడేసి తారలు ఒకే వర్గానికి చెందినవి.

**అనుకూల తారలు**

మీ జన్మతార ఏ వరుసలో వున్నదో చూడండి. ఆ వరుసలోని మిగిలిన రెండు తారలు కూడా జన్మతారలు గానే పరిగణించాలి. ఆ తరువాత వరుసలోని 3 నక్షత్రాలు మీ సంపత్ తారలు. మీ జన్మ తార నుండి 4 వ వరుసలోనివి క్షేమ తారలు. 6వ వరుసలోనివి సాధన తారలు. 8వ వరుసలోనివి మిత్ర తారలు. 9వ వరుసలోనివి పరమమిత్ర తారలు. అనగా మీ జన్మ తార గల వరుస నుండి క్రమంగా లెక్కించగా 2,4,6,8,9 వరుసలలోని తారలు అనుకూలమైనవి. జన్మతారలు మిశ్రమ ఫలితాలిస్తాయి. అక్కడి నుండి 2,4,6,8,9 వర్గాలలో సంపత్, క్షేమ, సాధన, మిత్ర, పరమ మిత్ర తారలు మొత్తం 15లో చంద్రబలం కూడా వున్న తారలు శుభఫలితాలనిస్తాయి. అంటే జన్మరాశిలోను, అక్కడి నుండి 3,5,7,10,11 రాశులలోను, తారాబలం గల పై నక్షత్రాలు కొన్ని మాత్రం శుభఫలితాలనిస్తాయి. మిగతావి మిశ్రమ ఫలితాలిస్తాయి.

| | | |
|---|---|---|
| 1. అశ్విని | 10. మఘ | 19. మూల |
| 2. భరణి | 11. పుబ్బ | 20 పూర్వాషాఢ |
| 3. కృత్తిక | 12 . ఉత్త ర | 21 ఉత్తరాషాఢ |
| 4. రోహిణి | 13. హస్త | 22. శ్రవణం |
| 5. మృగశిర | 14. చిత్త | 23. ధనిష్ఠ |
| 6. ఆర్ద్ర | 15. స్వాతి | 24. శతభిషం |
| 7. పునర్వసు | 16. విశాఖ | 25. పూర్వాభాద్ర |
| 8. పుష్యమి | 17. అనూరాధ | 26. ఉత్తరాభాద్ర |
| 9. ఆశ్లేష | 18. జ్యేష్ఠ | 27. రేవతి |

| **జన్మనక్షత్రం** | **అనుకూల నక్షత్రం** |
|---|---|
| 1. అశ్విని- | భరణి, ఆర్ద్ర, హస్త, స్వాతి, శ్రవణం, శతభిషం |
| 2. భరణి- | అశ్విని, పునర్వసు, ఉత్తర, చిత్త, విశాఖ, ఉ.షా, , దనిష్ఠ, పూ. భా |
| 3. కృత్తిక -1 | - అశ్విని, భరణి, ఆర్ద్ర, హస్త, స్వాతి, శ్రవణం, శతభిషం |
| కృత్తిక -2,3,4 | -రోహిణి,పుష్యమి,స్వాతి,అనూరాధ,శతభిషం, ఉ.భా. |
| 4. రోహిణి | - కృత్తిక, ఆశ్లేష, విశాఖ, జ్యేష్ఠ, పూ. భా., రేవతి |
| 5. మృగశిర1,2 | - కృత్తిక,రోహిణి,పుష్యమి,స్వాతి, అనూ,శత ఉ.భా. |
| మృగశిర 3,4 | - అశ్విని, ఆర్ద్ర, మఘ, అనూ, మూల, ఉ. భా. |
| 6. ఆర్ద్ర | - భరణి, పునర్వసు, పుబ్బ, జ్యేష్ఠ, పూ.షా, రేవతి |
| 7. పునర్వసు1,2,3 | - అశ్విని, ఆర్ద్ర,మఘ,అనూరాధ మూల, ఉ.భా |
| పునర్వసు 4 | - అశ్విని, కృత్తిక, పుష్యమి, ఉత్తర, మూల, ఉ.షా. |
| 8. పుష్యమి | - భరణి, రోహిణి, ఆశ్లేష, హస్త, పూ.షా, శ్రవణం |
| 9. ఆశ్లేష | - అశ్విని, కృత్తిక, పుష్యమి, ఉత్తర, మూల, ఉ.షా |
| 10. మఘ | - రోహిణి ఆర్ద్ర,పుబ్బ,స్వాతి, శ్రవణం, శతభిషం |
| 11. పుబ్బ | - కృత్తిక, మృగశిర, పునర్వసు, మఘ, విశాఖ, ఉ.షా, ధనిష్ఠ, పూ.భా. |
| 12. ఉత్తర 1 | - రోహిణి, ఆర్ద్ర, మఘ, పుబ్బ, స్వాతి, శ్రవణం, శతభిషం |
| ఉత్తర 2,3,4 | - ఆర్ద్ర, పుష్యమి, హస్త, అనూ., శత, ఉ. భా. |
| 13. హస్త | - పునర్వసు, ఆశ్లేష, ఉత్తర, జ్యేష్ఠ, పూ. భా, రేవతి |
| 14. చిత్త 1,2 | - ఆర్ద్ర, పుష్యమి, హస్త, అనూ., శత, ఉ. భా. |
| చిత్త 3,4 | - అశ్విని, పుష్యమి, మఘ, స్వాతి, మూల, ఉ. భా. |
| 15, స్వాతి , | - భరణి, ఆశ్లేష, పుబ్బ, విశాఖ, పూ. షా, రేవతి |
| 16. విశాఖ 1,2,3 | - అశ్విని, కృత్తిక, మఘ, ఉత్తర, అను, ఉ.షా. |
| విశాఖ 4 | - అశ్విని, కృత్తిక, మృగశిర, మఘ, ఉత్తర, చిత్త, ఉ.షా |
| 17. అనూరాధ | - జ్యేష్ఠ, పూ.షా. శ్రవణం, హస్త, రోహిణి |
| 18. జ్యేష్ఠ | - మూల, ఉ.షా., మృగశిర, చిత్త, ధనిష్ఠ |
| 19. మూల | - రోహిణి, ఆర్ద్ర, హస్త, స్వాతి, పూ.షా, శతభిషం |
| 20. పూర్వాషాఢ | - కృత్తిక, మృగశిర, పునర్వసు, ఉత్తర, చిత్త, విశాఖ, మూల, పూ. భా. |
| 21. ఉత్తరాషాఢ 1 | - రోహిణి ఆర్ద్ర ఉత్తర,హస్త,స్వాతి, మూల,పూ.షా, శత |
| ఉత్తరాషాఢ 2,3,4 | ఆర్ద్ర, పుష్యమి, స్వాతి, అనూ, శ్రవణం, ఉ. భా. |
| 22. శ్రవణం | - పునర్వసు, ఆశ్లేష, విశాఖ, జ్యేష్ఠ, ఉ.షా. రేవతి |
| 23. ధనిష్ఠ 1,2 | - ఆర్ద్ర, పుష్యమి, స్వాతి, అనూ, ఉ.షా. శ్రవణ, ఉ. భా. |
| 24. శతభిషం | - భరణి, ఆశ్లేష, పుబ్బ, జ్యేష్ఠ, పూ.షా. పూ. భా |
| 25. పూ. బా 1,2,3 | - అశ్విని, పుష్యమి, మఘ, అను, మూల, శత |
| పూ. భా 4 | - కృత్తిక, మఘ, ఉత్తర, మూల, ఉ.షా, ఉ. భా. |
| 26. ఉ. భా | - రోహిణి, పుబ్బ, హస్త, పూ. షా, శ్రవణం, రేవతి |
| 27. రేవతి | - కృత్తిక, మఘ, ఉత్తర, మూల, ఉ షా, ఉ. భా. |

మీ జన్మతార గల వరుస నుండి 3,5,7 వరుసలలోని విపత్, ప్రత్యక్, నైధన తారలు ప్రతికూలం. వీటికి తారాబలం లేదు. వీటిలో చంద్రబలం గల తారలు తక్కువ ప్రతికూలం. చంద్రబలం కూడా లేనివి అనగా జన్మరాశి నుండి 2,4,5,8,9,11 రాశులలో వున్న విపత్, ప్రత్యక్, నైధన తారలు పూర్తిగా ప్రతికూల ఫలితాలనిస్తాయి. ఎందుకంటే వాటికి తారాబలం కూడా లేదు. ఒక బలం వుండి మరొక బలం లేనివి మిశ్రమ ఫలితాల నిస్తాయి. ఈ ప్రకారం 27 నక్షత్రాలను 3 రకాలుగా విభజించాలి.

1. శుభతారలు 2. మిశ్రమ తారలు 3. ప్రతికూల తారలు. పంచాంగంలో ఈ నక్షత్రాలున్న దినాలు ఆ యా ఫలితాలిస్తాయి.

**ఫలితాలు**

1. సంపత్ తారలు - ఆర్థిక సదుపాయం, బాకీల వసూల, ఋణసౌకర్యం, ఋణతీర్మానం, బ్యాంకు వ్యవహారాలు, కొనుగోళ్ళు, వ్యాపారవ్యవహార లాభం, వస్తుప్రాప్తి, సౌఖ్యం, మనోవికాసం, ప్రయోజన సిద్ధి.
2. క్షేమ తారలు - ఆరోగ్యం, సౌకర్యం, రక్షణ, భద్రత, ప్రయాణం, కష్టవిమోచనం, కార్యానుకూలత, శ్రేయోభిలాషుల సహకారం, నిరపాయ స్థితి, శుభకార్యం, నూతన కార్యారంభం.
3. సాధన తారలు - కార్య సాధన, ప్రయోజన సిద్ధి, ఆశయ సాఫల్యం, ఇష్ట వస్తు ప్రాప్తి, ద్రవ్య సదుపాయం, గుర్తింపు, రాణింపు, శ్రమకు ప్రతిఫలం
4. మిత్ర పరమ మిత్ర తారలు - పరిచయ లాభం, మిత్ర సహకారం, పెద్దల సుముఖత, విందు వినోదాలు, వ్యక్తిత్వ వికాసం, సమర్ధతకు రాణింపు, శుభకార్యం, అనుకూల పరిణామాలు, పలుకుబడి, ఆనందం, సదుపాయాలు, కార్యసిద్ధి, లాభం.

**ప్రతికూల తారలు**

1. విపత్ తారలు - ఆపద, అపాయం, గాయాలు, శ్రమ, నిర్బంధం, అనారోగ్యం, ఆందోళన, భయం, ఆటంకం, నష్టం, అవమానం, చిక్కులు, కష్టాలు, ప్రమాదాలు.
2. ప్రత్యక్ తారలు - ఆశాభంగం, విపరీతాలు, దుఃఖం, నిరాశ, కార్యభంగం, ఆటంకాలు, ఓటమి, అవమానం, నష్టం, కష్టం, మనోవ్యాకులత.
3. నైధన తారలు - విరోధం, కలహం, వివాదాలు, లిటిగేషన్లు, పోటీలు, శత్రు భయం, ఒత్తిడి, వ్యతిరేకత, అవమానం, పరాజయం, పెద్దల విముఖత, వంచన, శోకం, అపాయం, ప్రమాదాలు.

ఈ ఫలితాలు కేవలం చంద్ర సంచారానికి సంబంధించిని మాత్రమే.

★★★★★★★

# పుట్టిన దినం - అంకెల ప్రభావం

1,2,3,4,5,6,7,8,9 ప్రపంచ నిర్మాణంలో ఈ తొమ్మిది అంకెలు మూలస్థంభాలని ప్రముఖ గణిత శాస్త్ర పండితుడు పైథాగరస్ ఉద్ఘాటించారు మానవ జీవితంలో అంకెల ప్రభావం వుందని సంఖ్యాశాస్త్ర పరిశోధకులు విశదీకరించి ఎన్నో గ్రంథాలు రచించారు.

ఎన్ని అంకెలతో కూడిన పెద్ద సంఖ్యనైనా ఒకే అంకెగా కుదించవచ్చు. సంఖ్యలోని అంకెలన్నింటినీ కూడి, ఆ సంఖ్యలోని అంకెలు ఒకటి కంటే ఎక్కువ వున్నప్పుడు వాటిని కూడా కూడిక చేయాలి. మరలా మరలా కూడిక చేస్తే చివరకు ఒకే అంకెగా మారుతుంది సున్నాలను విడిచిపెట్టవచ్చు. 357281469 అనే సంఖ్యలోని అంకెలన్నీ కూడిక చేస్తే వచ్చే సంఖ్య 45. దీనిని మరలా కూడగా 9 వస్తుంది. ఇది ఆ పెద్ద సంఖ్యను కుదించగా వచ్చిన కీలకమైన అంకె.

ఒక వ్యక్తి జన్మదినం 24-3-1929 ఇందులోని 7 అంకెలను కూడగా 30 వస్తుంది. సున్నను విడిచి పెడితే మిగిలిన అంకె 3 ఇది ఆ వ్యక్తికి కీలకమైన అంకె.

## పుట్టిన తేదీ - అంకె

ఇదికాక పుట్టిన తేదీకి వర్తించే అంకెకు కూడా ప్రాముఖ్యం వుంది. నెలను, సంవత్సరాన్ని విడిచిపెట్టి కేవలం పుట్టిన తేదిని మాత్రమే గ్రహించాలి. ఏ నెలలోనైనా ఈ తేదీలు 1 నుండి 31 వరకు మాత్రమే వుంటాయి. 1 నుండి 9వ తేదీ వరకు అదే అంకె పుట్టిన తేదీకి వర్తించే అంకె అవుతుంది. 10 నుంచి 31వ తేదీ వరకు రెండు అంకెలు వుంటాయి. ఆ రెండు అంకెలను కూడగా వచ్చిన అంకె జన్మదినానికి వర్తించే అంకెగా భావించాలి.

| జన్మతేదీలు | అంకె |
|---|---|
| 1-10-19-28 | 1 |
| 2-11-20-29 | 2 |
| 3-12-21-30 | 3 |
| 4-13-22-31 | 4 |
| 5-14-23 | 5 |
| 6-15-24 | 6 |
| 7-16-25 | 7 |
| 8-17-26 | 8 |
| 9-18-27 | 9 |

**అంకెలకు వర్తించే గ్రహాలు**

1-సూర్యుడు 2-చంద్రుడు3-గురువు4- ఇంద్ర 5-బుధ 6-శుక్ర 7 వరుణ 8-శని 9-కుజుడు.

## సుముఖత - విముఖత

ప్రతి అంకెకు కొన్ని అంకెలతో సుముఖత మరికొన్ని అంకెలతో విముఖత ఏర్పడుతుంది. సుముఖతను సూచించిన అంకెలు గల వ్యక్తులు, ప్రదేశాలు, రోజులు, వస్తువులు కార్యసాధనకు తోడ్పడవచ్చు విముఖత సూచించే అంకెలు గల వ్యక్తులు, దినాల వల్ల కష్టంగాని, నష్టం గాని సంభవం ఈ దిగువ పట్టికలో 1 నుండి 9 వరకు ప్రతి అంకెకు సుముఖతను, విముఖతను సూచించే అంకెలు గ్రహించగలరు.

| అంకె | సుముఖం | విముఖం |
|---|---|---|
| 1 | 4-8 | 6-7 |
| 2 | 7-9 | 5 |
| 3 | 6-9-5 | 4-8 |
| 4 | 1-8 | 3-5 |
| 5 | 3-9 | 2-4 |
| 6 | 3-9 | 1-8 |
| 7 | 2-6 | 1-9 |
| 8 | 1-4 | 3-6 |
| 9 | 3-6-2 | 7 |

**సున్న** : అంకె తరువాత సున్న వుంటే ఆ సంఖ్య శక్తివంతమవుతుంది. 10,20.30 తేదీలు 1,2,3 కంటే శక్తివంతమైనవి. అదే విధంగా సంవత్సరంలో చివర సున్నాగాని, సున్నాలు గాని వుంటే అవి శక్తివంతమవుతాయి. 2000లో 3 సున్నాలు వున్నందున ఈ సంవత్సరం అతి శక్తివంతమైనది. అక్టోబర్ 10వ నెలగనుక ఆ నెలకు ప్రాముఖ్యం ఎక్కువ కూడికలలో సున్నాకు విలువ లేదు. పుట్టిన తేదీలలో 11,22 తేదీలకు విశేష ప్రాముఖ్యం వుంటుంది. అలాగే 1 నుండి 31వ తేదీ వరకు ప్రతి తేదీకి కొన్ని ప్రత్యేకతలు వున్నాయి. సంఖ్యాశాస్త్రంలో ఇవి వివరంగా తెలుస్తాయి

ఏదైనా ఒక దినం అనుకూలమా ప్రతికూలమా అని నిర్ణయించడానికి ఆ నాటి తేదీ, నెల, సంవత్సరంలోని అంకెలన్నింటినీ కూడిక చేసి వచ్చిన సంఖ్యను ఒకే అంకెగా కుదించాలి. అది ఆనాటి కీలక సంఖ్య అవుతుంది. ఉదాహరణః 16-11-2000. ఇందులోసున్నలు విడిచి పెట్టి మిగిలిన1-6-1-1-2 కూడగా 11 వస్తుంది. ఈ రెండు అంకెలను కూడగా 2 వస్తుంది. ఇది కీలకమైన అంకె. వ్యక్తుల కీలక అంకె 7 గాని 9 గాని అయితే అనుకూలం 5 కీలక సంఖ్యగల వారికి ఆ తేదీ ప్రతికూలం.

## పరస్పర సామరస్యం

పుట్టిన రోజుకు వర్తించే అంకెలను 3 వర్గాలుగా విభజించ వచ్చు 1-5-7 ఒక వర్గానికి చెందినవి. 2-4-8 రెండవ వర్గానికి చెందినవి 3-6-9 మూడవ వర్గానికి చెందినవి ఒకే వర్గానికి చెందిన అంకెలు గల వ్యక్తుల మధ్య సఖ్యత వుంటుంది. వివాహం, భాగస్వామ్యం, స్నేహం తదితర అంశాలలో ఈ సఖ్యత తోడ్పడుతుంది. మొదటి వర్గంలోవి బేసి సంఖ్యలు.రెండవ వర్గంలోనివి సరి సంఖ్యలు. 3 వర్గంలోనివి 3-9 బేసి సంఖ్యలు కాగా 6 సరి సంఖ్య. రెండు బేసి సంఖ్యలకు గాని రెండు సరి సంఖ్యలకు గాని ఈ వర్గంలో వున్నవారి మధ్య ఎక్కువ సామరస్యం వుంటుంది.

## మంచి రోజుల ఎంపిక

ఒక వ్యవహారం అనుకూలంగా వుండాలంటే పుట్టిన తేదీలకు వర్తించే అంకెల వారు తమ అంకెలకు వర్తించే అనుకూల దినాలను ఎంపిక చేసుకోవాలి. ఏ నెలలో అయినా 1-10-19-28 తేదీలలో పుట్టిన వారు ప్రతి ముఖ్యమైన పని 1-10-19-28 తేదీలలో నిర్వహించడం మంచిది. వారికి 4-8 సుముఖమైన అంకెలు అయినప్పటికీ 4-13-22-31 తేదీలను విడిచి పెట్టడం శ్రేయస్కరం. ఇదే సూత్రం అన్ని అంకెల వారికి వర్తిస్తుంది అయితే 4-8 అంకెల వారు అనగా 4-13-22-31 తెదీలలో పుట్టిన వారు మాత్రం ఆ తేదీలలో కాక అనుకూలమైన ఇతర తేదీలలో పనులు నిర్వహించడం మంచిది. 8-17-26 తేదీలు కూడా వారు వదిలిపెట్టాలి 9-18-27 కూడా వారికి సరిపడవు.

## అంకెల ప్రభావం

1 - ఇది సూర్యునికి చెందిన అంకె. హుందాతనం, ఆధిక్యం, పెత్తనం, గుర్తింపు, హోదా, ఔదార్యం, పోషణ, ఆత్మగౌరవం, ధృఢ సంకల్పం వీరికి అత్యంత ప్రధానం. ఒక బృందంలో పెద్దగా, ఒక సంస్థలో అధికారిగా, పాలకునిగా వీరు రాణిస్తారు నిర్వహణ సమర్థత, సృజనాత్మక శక్తి వుంటాయి.

2 - ఇది చంద్రుని అంకె. వీరిలో ప్రేమ, ఆలోచనా పటిమ, జ్ఞాపక శక్తి ప్రతిస్పందన, ఉద్రేకం, తరచు మారే పోకడలు, తమ చర్యలను సమర్థించుకోవాలనే తపన, మానసిక అశాంతి కనిపిస్తాయి. సంచార శీలం గల వృత్తులు, వ్యాపారం, నటన, కళలు, ప్రజలతో అనుదిన సంబంధాలు గల ఉద్యోగ, వ్యాపార, వృత్తులు, నిత్యావసరాల వాణిజ్యం అనుకూలిస్తాయి. నిర్ణయాలలో ఊగిసలాట కనిపిస్తుంది.

3 - ఇది గురుని అంకె. వివిధ విషయాలు, శాస్త్ర విజ్ఞానం పట్ల ఆసక్తి, ఆత్మ విశ్వాసం, సంగీత సాహిత్యాలపై అభిరుచి, సృజనాత్మక ప్రతిభ, జనాకర్షణ, వీరిలో కనిపిస్తాయి. తమ సమర్థత, విజ్ఞానం ప్రతిభలు చూపించ గల ఏ వృత్తిలోనైనా రాణిస్తారు. ఇతరులలో ప్రేరణ కలిగిస్తారు.

4 - ఇది ఇంద్రుని అంకె. వీరిలో మంచి ఊహాశక్తి, వ్యూహ కల్పన, యుక్తి, అత్యాశ, ఉన్నత స్థాయికై కృషి, సాంకేతిక నైపుణ్యం, మౌలికత్వం, సాహసం, ఆకస్మిక లాభాలపై ఆశ, స్వార్థ చింతన, విశ్వసనీయత, ఉద్రిక్తత కనిపిస్తాయి.

సకాలంలో సమర్థవంతంగా పనులు చేయడం వీరి ప్రత్యేకత. వ్యాపారం, రాజకీయాలు, కళలు, సాంకేతిక రంగాలలో రాణిస్తారు. ఆకస్మిక శుభఅశుభ ఫలితాలు జీవన సరళిని మారుస్తుంటాయి.

5 – ఇది బుధుని అంకె. ఆలోచనా పటిమ, గ్రహణ శక్తి, వాక్చాతుర్యం, యుక్తి, అనుకరణ, విచక్షణ, విక్రయ సమర్థత, విద్యా సారస్వత, వైజ్ఞానిక విషయాలలో ఆసక్తి, సంచార కుతూహలం, చపలత, అస్థిరత కనిపిస్తాయి. రచన, బోధన, వాదన, ప్రచార, ప్రచురణ, సమాచార, వాణిజ్యం, కళారంగాలలో రాణిస్తారు. భావాలకు రూప కల్పనలో సిద్ధహస్తులు.

6 – ఇది శుక్రుని అంకె. వీరిలో సంఘీభావం, స్నేహశీలం, యుక్తాయుక్త విచక్షణ జనాకర్షణ, భావప్రకటనలో నిపుణత, అందమైన, కళాత్మకమైన వస్తువుల పట్ల ఆకర్షణజనాదరణ పొందడాని కృషి కనిపిస్తాయి. వివిధ రంగాలలో రాణిస్తారు. సంగీత, నృత్య, నాటక, చిత్రలేఖన, శిల్ప, నటనాది కళలలో వస్త్రాభరణ, సుందర వస్తువుల వ్యాపారాలలో, క్రీడలు, రాజకీయాలలో ఎక్కువ రాణిస్తారు. ఒంటరి తనం సరిపడదు.

7 – ఇది వరుణుని అంకె. వీరిలో ఊహా శక్తి, కల్పనా చాతుర్యం, విచక్షణ, విమర్శనాత్మక దృక్పథం, కళాభిరుచి, స్వార్థ చింతన, ఉన్నత స్థాయి కోసం తపన, జ్యోతిష, మంత్ర, అద్భుత శాస్త్రాలు, కవితలు, కళలు, శిల్పాలు, కృత్రిమ సౌందర్యాలు, ఆధ్యాత్మిక వైద్య విషయాల పట్ల ఆసక్తి కనిపిస్తాయి. బంధుమిత్రులు వున్నా స్వార్థపరత్వం వల్ల ఒంటరి వారవుతారు.

8 – ఇది శని అంకె. వీరిలో లౌకిక దృక్పథం, ప్రయోజన చింత, ఆల్మాతిశయం, అత్యాశ, కార్యదీక్ష, పట్టుదల, ఉద్రేకం, నిగ్రహం, కటువుదనం, నిర్వహణ సమర్థత, స్వశక్తి ప్రతిభలపై విశేషమైన విశ్వాసం, పెద్ద ఆలోచనలు కనిపిస్తాయి. వ్యాపారాలలో రాణిస్తారు. వ్యతిరేకతను భరించలేరు.

9 – ఇది కుజుని అంకె. మంచి శక్తి సామర్థ్యాలు, ధైర్య సాహసాలు, తెలివి, చొరవ, ప్రేరణ, జనాకర్షణ, ఆత్మవిశ్వాసం, కార్యనిర్వహణ నైపుణ్యం కనిపిస్తాయి. ఇతరులను ప్రభావితం చేస్తారు. వైవిధ్యం, చొరవ, తెగువ, నవ్యత, సత్వర నిర్ణయం, తక్షణ చర్యలు అవసరమైన రంగాలలో రాణిస్తారు.

**నామాక్షర సంఖ్య**

ఇంగ్లీషులో 26 అక్షరాలలోని ప్రతి అక్షరాన్ని ఒక అంకెగా మార్చ వచ్చు. ఏ అక్షరానికి ఏ అంకె వర్తిస్తుందో సంఖ్యా శాస్త్రంలో వివరించారు. ఇందులో రెండు పద్ధతులు వాడుకలో వున్నాయి. ఒకటి హెబ్రూ కబాలా పద్ధతి రెండవది పైథాగరస్ సిద్ధాంతం. పేరులో గల అక్షరాలకు వర్తించే అంకెలను ఈ దిగువన ఇచ్చాము.

**హెబ్రూ పద్ధతి**

ఈ పద్ధతిలో అక్షరాలకు వర్తించే అంకెలు ఈ విధంగా వుంటాయి

A - 1, B - 2, C - 3, D - 4, E - 5, F - 8, G - 3, H - 5, I - 1, J - 1, K - 2, L - 3, M - 4, N - 5, O - 7, P - 8, Q - 1, R - 2, S - 3, T - 4, U - 6, V - 6, W - 6, X - 5, Y - 1, Z - 7.

**పైథాగరస్ పద్ధతి**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I |
| J | K | L | M | N | O | P | Q | R |
| S | T | U | V | W | X | Y | Z | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |

**ఏ పేరు వర్తిస్తుంది?**

ఇంటి పేరు పూర్తి పేరు తీసుకోవాలి. లేదా ఎక్కువగా వాడుకలో వున్న పేరు తీసుకోవాలి. V.V.RAO అనే వాడుకలో వున్న పేరుకు ఏ అంకె వర్తిస్తుంది? పైథాగరస్ సిద్ధాంతం ప్రకారం V-4,V-4,R-9,A-1,O-6 కనుక 4-4-9-1-6 ఈ అంకెలను కూడగా 24 వస్తుంది. మరలా కూడగా 6 వస్తుంది. ఇది నామాక్షర సంఖ్య.. పుట్టిన తేదీ తెలియని వారికి ఈ నామక్షర సంఖ్య ఉపయోగ పడుతుంది. ఇంగ్లీషులో అచ్చులు A, E, I, O, U ప్రతి పేరులో ఏదో ఒక అచ్చు తప్పని సరిగా వుంటుంది. ఏ అచ్చు లేనప్పుడు Y అనే అక్షరం వుంటుంది. దానిని అచ్చుగా పరిగణించాలి. మిగిలినవి హల్లులు. పేరులో ఒక అక్షరం ఎక్కువ సార్లు వచ్చినా, అచ్చుల సంఖ్య అధికంగా వున్నా దానికి ఒక ప్రత్యేకత వుంటుంది.

కొందరు తమకు అనుకూలమైన నామాక్షర సంఖ్య వచ్చే విధంగా కొన్ని అచ్చులను, హల్లులను చేర్చి, మార్చి సవరించుకుంటారు. లేదా అనుకూలించే విధంగా కలం పేరు పెట్టుకుంటారు. విశేషంగా వాడుకలో వున్న పేరు ప్రాముఖ్యం సంతరించుకుంటుంది.

వివాహ జీవితంలో సామరస్యం కోసం వధువు గాని వరుడు గాని పేరు మార్చుకుంటారు. దత్తత పోయిన వారికి, వివాహమైన మహిళలకు ఇంటి పేరు మారడం సహజం. అలా మారిన తరువాత నామాక్షరాల సంఖ్యల ప్రకారం వారి జీవన విధానంలో కొన్ని మంచి చెడులు సంభవం. MURTHY అనే పేరులోని అక్షరాలను అవసరమైతే MURTHI, MURTI, MOORTI, MOORTHI, MOORTHY అని మార్చవచ్చు. వీటి అంకెలలను కూడితే కీలక అంకె మారుతుంది.

| | | |
|---|---|---|
| 1. MURTHY | 4-3-9-2-8-7 | =33=6 |
| 2. MURTHI | 4-3-9-2-8-9 | =35=8 |
| 3. MURTI | 4-3-9-2-9 | =27=9 |
| 4. MOORTHY | 4-6-6-9-2-8-7 | =42=6 |
| 5. MOORTHI | 4-6-6-9-2-8-9 | =44=8 |
| 6. MOORTI | 4-6-6-9-2-9 | =36=9 |

ఇందులో 1,4 పేర్లకు 6 అంకె, 2,5 పేర్లకు 8 అంకె, 3-6 పేర్లకు 9 అంకె వర్తిస్తాయి.

పేరులోని మొదటి అక్షరానికి వర్తించే అంకెను పుట్టిన తేదీ అంకెతో సమానంగాను మొత్తం అక్షరాలకు వర్తించే నామాక్షర సంఖ్య, జన్మదిన కీలక సంఖ్య, సమంగాను పరిగణించ వచ్చు.

వ్యక్తుల పేర్లనే గాక నగరాల పేర్లను, వస్తువుల పేర్లను, విషయాల పేర్లు కూడా అంకెలుగా మార్చి నామాక్షర సంఖ్యలో అనుకూల, ప్రతికూలతలను పరిశీలించవచ్చు. నామాక్షర సంఖ్యకు గాని, జన్మదిన కీలక సంఖ్యకు గాని అనువుగా వుండేవిధంగా వ్యాపార సంస్థల పేర్లు వాహనాల నెంబర్లు మొదలైనవి నిర్ణయించవచ్చు.

**జన్మదిన సంఖ్య – నామాక్షర సంఖ్య**

పుట్టిన తేదీకి అన్వయించే అంకెకు, నామాక్షరాల సంఖ్యకు సామరస్యం కుదిరే విధంగా పేరును సవరించుకోవచ్చు. ".. నామాక్షర సంఖ్య 6 కాగా, జన్మదినం 24-3-1929 కీలక అంకె 3. ఈ రెండింటకి పరస్పర మైత్రి వున్నది గనుక మార్పు అనవసరం.

**వారాల అంకెలు**

ఆదివారం – 1, సోమవారం – 2, మంగళ వారం – 9, బుధవారం – 5, గురువారం – 3, శుక్రవారం – 6, శనివారం –8

**సంవత్సరాలు**

ఒక సంవత్సరంలోని అంకెలన్నీ కూడగా వచ్చిన అంకె, ఆ అంకెకు మీ పుట్టిన తేదీ, నెల అంకెలు చేర్చి కూడగా వచ్చిన అంకె, ఆ సంవత్సరం ఫలితాలను సూచిస్తుంది. ఆ అంకె మీ కీలక సంఖ్య లేదా నామాక్షర సంఖ్య అయితే ఎక్కువ ప్రాధాన్యం వుంటుంది. అక్టోబర్ 3వ తేదిన పుట్టిన వారికి 2000 సంవత్సరం ఏ అంకెను సూచిస్తుంది? 2000 సంవత్సరానికి 2 అంకె. పుట్టిన నెల అక్టోబర్ 10, అంకె = 1, తేదీ =3 గనుక 2-1-3 కూడితే వచ్చిన అంకె 6. స్నేహ బాంధవ్యాలు, జన సంబంధాలు, వ్యాపార ఒప్పందాలు, కాంట్రాక్టులు, కళలు, సాహిత్యం, కుటుంబ బాధ్యతల నిర్వహణ, వస్తు సేకరణ, సమర్థతల వికాసానికి 2000 సంవత్సరం అనుకూలం. మిగిలిన అంకెలకు అంకెల ప్రభావం శీర్షికన సూచించిన అంశాలు ప్రభావితం అవుతాయి.

**అక్షర సంవత్సరాలు**

పూర్తి పేరులో ఎన్ని అక్షరాలు వున్నాయో అన్ని సంవత్సరాలు ఒక దశగా భావించాలి. తరువాత ఆ వ్యక్తికి అవే దశలు పునరావృతం అవుతాయి. అక్షరాలకు వర్తించే అంకెలలో మొదటి అంకె మొదటి సంవత్సరానికి, అదే క్రమంలో చివరి అంకె చివరి సంవత్సరానికి వర్తిస్తాయి. నామాక్షర కీలక సంఖ్యలో సఖ్యత గల అంకె ఏ సంవత్సరంలో వస్తుందో ఆ సంవత్సరం విశేష ఫలితాలిస్తుంది. ప్రతి అంకె తనకు వర్తించే అంశాలను ప్రభావితం చేస్తుంది. ఈ విధంగా సంఖ్యా శాస్త్రంలో ఎన్నో విషయాలున్నాయి. అవి చదివి మరింత వివరంగా తెలుసుకోవచ్చు.

# వాస్తు అనేది శాస్త్రమా? మూఢనమ్మకమా?

## సందేహాలు-సమాధానాలు

వాస్తు అంటే తమకు నమ్మకం లేదని అందుకే వాస్తును పాటించడం లేదని చెప్పుకునేవారు కొందరున్నారు వారికి అసలు వాస్తు అంటే అర్థం తెలియక, అది ఎంతో ఉపయోగకరమైన శాస్త్రమని అవగాహన లేక అలా అంటారు

**వాస్తు అంటే అర్థం ?**

వాస్తు అంటే వసతియోగ్యమైన భూమి అని, వస్తువు అని అర్థం సమస్త వస్తువులకు ఆధారం భూమి గృహనిర్మాణానికి ఉపయోగించే కలప, రాయి, ఇసుక, లోహాలు మాత్రమేగాక, రథాలు, వాహనాలు, ఓడలు, మంచాలు, కుర్చీలు, టేబుళ్ళు, పీటలు, బీరువాలు, పాత్రలు, యంత్రాలు, పరికరాలు మొదలైన వన్నీ వాస్తు పరిధిలోకి వస్తాయి ఇవి ఏకాంతత, ఆకారాలతో తయారు చేయాలి ఇల్లు మొదలైన కట్టడాలు ఏ విధంగా నిర్మించాలో చెప్పేది వాస్తు శాస్త్రం ఈ శాస్త్రంలో సివిల్ ఇంజనీరింగ్, ఆర్కిటెక్చర్, ఆర్ట్ అండ్ క్రాఫ్ట్స్ మొదలైనవెన్నో ఇమిడి ఉన్నాయి గృహం నిర్మించే ముందు ఒక ప్లాను వేసుకోవటం ఆనవాయితీ ఆ ప్లాను ఎలా ఉండాలో సూచించేది వాస్తు శాస్త్రం అయినప్పుడు ఇది మూఢ నమ్మకం ఎలా అవుతుంది? దీన్ని పాటించటం లేదని చెప్పటంలో అర్థంలేదు

**మరి వాస్తు ఒక శాస్త్రమైతే పండితులు ఎవరికి తోచిన విధంగా వారు సలహాలిస్తారు. కొన్ని పరస్పర విరుద్ధంగా ఉంటాయి. కారణం?**

దేనికైనా ఒక ప్రమాణం అవసరం వాస్తు శాస్త్రంపై ప్రామాణిక గ్రంథాలున్నాయి అతి కీలకమైన అంశాలపై ప్రామాణిక గ్రంథాలన్నింటిలో నూ వివరించిన సూత్రాలన్నీ ఒకే తీరుగా ఉంటాయి పరస్పర విరుద్ధంగా ఉండవు అయితే ఇటీవల కొందరు ఆధునికులు ప్రామాణిక గ్రంథాలను పూర్తిగా చదవక, చదివినా వాటిని అనుసరించక స్వతంత్రంగా వాటికి విరుద్ధంగాకూడా తమ రచనలు వ్యాసాలు ప్రచారం చేసుకోవడం వలన అవి చదివిన వారు ఏది శాస్త్రీయమో కాదో తెలియక తికమక పడుతున్నారు

**ఏవి ప్రామాణికమైన గ్రంథాలు?**

మానసారం, విశ్వకర్మ ప్రకాశిక, బృహత్ సంహిత సమరాంగణ సూత్రధారం, మయవాస్తు, అపరాజిత పృచ్ఛ వాస్తు విద్య, శిల్పరత్న, విశ్వకర్మవాస్తు మొదలైన గ్రంథాలెన్నో శతాధికంగా ఉన్నాయి

**వాస్తు శాస్త్రం బోధించే కళాశాలలున్నాయా?**

తెలుగు విశ్వవిద్యాలయంలో పోస్టుగ్రాడ్యుయేట్, జ్యోతిర్వాస్తు సర్టిఫికెట్, డిప్లమో కోర్సులు న్నాయి ప్రామాణిక గ్రంథాల ఆదారంగా తెలుగుయూనివర్శిటి వారు పాఠ్యగ్రంథాలు ప్రచురించి బోధిస్తున్నారు

**వాస్తు వల్ల ప్రయోజనం ఏమిటి?**

మన జీవితంలో భూమి, నీరు, గాలి,వెలుతురు, ఆకాశం అనే పంచభూతాల ప్రభావం అధికంగా ఉంటుంది గృహనిర్మాణంలో వీటి ప్రాధాన్యం ఎక్కువ స్థలం ఎంపికలో ఏ విషయాలు గమనించాలో నివాస సౌకర్యాలకు అనుగుణంగా అందంగా ఇల్లు ఎలా కట్టుకోవాలో, దోషాలు బాధించకుండా ఏ జాగ్రత్తలు తీసుకోవాలో వాస్తు శాస్త్రం విశదీకరిస్తుంది స్థలం ఆకారం, భూమి స్వభావం, పరిసరాల ప్రభావం నీటిపాటు, గృహవైశాల్యం, సౌకర్యాలకు, ఆరోగ్యానికి, ప్రశాంత జీవితానికి అనుగుణంగా గదుల ఏర్పాటు, దిశలు, మూలల నిర్ణయం, వాటి ప్రాముఖ్యం గృహసౌందర్యం, వీధిలో పంక్తిశోభ, సింహద్వారం ఉండదగిన చోటు ఇంకా ఎన్నో విషయాలపై అవగాహనకు వాస్తు సూత్రాలు తోడ్పడతాయి ఎవరికి ఏ దిశలో గృహం అనుకూలమో తెలుస్తుంది

**దక్షిణపు రోడ్లు, పడమటి రోడ్లుగల స్థలాలు మంచివి కావంటారు.**

**మరి దక్షిణ పశ్చిమాలలో రోడ్లు లేని ఊరు ఉంటుందా?**

ఏ గ్రామంలోనైనా నలుదిక్కుల్లోనూ వీధులుంటాయి ఇళ్ళు కూడా ఉంటాయి అన్నీ మంచివే దక్షిణ-పశ్చిమ వీధులు గల స్థలాలు మంచివి కావని ఏ ప్రామాణిక గ్రంథంలోనూ చెప్పలేదు ఇది ఆధునికులలో కొందరి అభూత కల్పన లౌకిక జ్ఞానంతో ఆలోచిస్తే నలుదిక్కులలోనూ వీధులు, ఇళ్ల ఉన్నప్పుడె అది ఊరు అవుతుంది ఒకటి రెండు వీధులే ఉంటే అవి వాడలు అవులాయి వీధి ఏ దిశలో ఉంటే ఇల్లు ఏ విధంగా కట్టుకోవాలో ప్రామాణిక గ్రంథాలలో వివరించారు ఈ శాస్త్రంలో దిశలు, మూలలకు ఎక్కువ ప్రాధాన్యం అవి లోపిస్తే దిఙ్మూఢం ఏర్పడుతుంది అది దోషం

**దిఙ్మూఢం అంటే ఏమిటి? దిక్కులు ఎలా లోపిస్తాయి ?**

స్థలం మధ్య నుండి దిక్సూచిలో చూసినప్పుడు నలు ప్రక్కలు సరిగా నాలుగుదిశలుగా ఉండాలి వీధులు ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి వాయువ్య మూలలవుతాయి స్థలం, చతురస్రం, దీర్ఘచతురస్రాకారంలో ఉండాలి అలాకాక త్రికోణం, అండాకారం, చేట-కుండ-చక్రం-దండం-బాణం, నాగలి, తదితర ఆకారాలలో ఉన్న స్థలంలో దిశలుగాని మూలలు గానిలోపిస్తాయి

**మరి ఈశాన్యం ఎంత పెరిగితే అంతమంచిదంటారు గదా?**

అది చాలా పొరపాటు ఇది కూడా కొత్తగా వాస్తు రచయితలు చేస్తోన్న దుష్ప్రచారం ఈశాన్యం ఒక మినపగింజప్రమాణం (మాష మాత్రం) పెరిగితే మంచిదని ప్రమాణిక వాస్తుపండితులు చెప్పారు ఎక్కువ పెరిగితే చేటు, స్థలం ఆకారం మారుతుంది ఏ మూల కూడా పెరగకూడదు నలుప్రక్కలలో సరిగా నాలుగు దిశలు ఉన్న చతురస్రం లేదా దీర్ఘ చతురస్రం గల భూమి మాత్రమే

**మూలలు పెరిగిన స్థలంలో ఇల్లు కట్టకూడదా?**

కట్టవచ్చు కాని, పెరిగిన స్థలాన్ని విడిచిపెట్టాలి మిగిలిన స్థలాన్ని చతురం, లేదా, చతురంగా మార్చి, సరిహద్దులు నిర్ణయించి గృహం నిర్మించాలి ఆ యింటికి సంబంధం లేకుండా వేరు చేసిన మిగులు స్థలంలో పూలదొట, కారుషెడ్లు, సేవకుల కుటీరం మొదలైనవి ఉండవచ్చు

**మూలలకు వీధులున్న స్థలాలు ఏం చేయాలి?**

వీధులలోని ఇళ్లన్నీ ఒకే వరుసలో ఉంటేనే పంక్తి శోభ కలిగిచూడటానికి ఇంపుగా ఉంటాయి ఇట్టి మూల వీధులుగల స్థలాలలో దిక్కులు స్థలానికి మూలలో కనిపిస్తాయి సింహద్వారం మూలలకు ఎదురుగా ఉండకూడదు ఏదో ఒక దిశకు ఎదురుగా ఉండాలి అలా ఏదో ఒక దిశకు సింహద్వారం నిర్ణయించి నాగలి ఆకారంలో ఇంటిప్లాను వేసుకోవాలి అదే ఆకారంలో రెండు ఇళ్ల కలిపి గాని, విడివిడిగా గాని నిర్మించవచ్చు వాస్తుపద విభజన కష్టతరమవుతుంది

**వాస్తుపదం అంటే ?**

ఎంత పొడవు, ఎంత వెడల్పు గల స్థలంలో ఇల్లు కట్టదలచుకున్నారో ముందు నిర్ణయించుకున్నాక, పొడవును తొమ్మిది సమభాగాలు, వెడల్పు కూడా తొమ్మిది సమ భాగాలు చేయాలి అలా చేస్తే 21 గదులు వస్తాయి దీనినే ఏకాశీతి పద వాస్తు అంటారు

**వాస్తుపద విభజన ఎందుకు చేయాలి ?**

వాస్తుపద విభజన చాలా అవసరం దాని వలన ఎన్నోప్రయోజనాలున్నాయి య

1 స్థలంలో దిశలు-మూలలు ప్రమాణం తెలుస్తుంది

2 మధ్యలో బ్రహ్మస్థానం గుర్తించవచ్చు

3 ఏ దిశలోనైనా సింహద్వారం ఎక్కడ నిర్మించాలో నిర్ణయించడం తేలిక

4 ఎంత స్థలం ఖాళీగా ఉండాలో గ్రహించవచ్చు చుట్టూ ఒక భాగం అనగా 1 నుండి 32 గదులు గా స్థలం విడిచి పెట్టాలి దీనిని పిశాచభాగం అంటారు నలుదిశలలోను ఖాళీ స్థలం లేకుండా ఇల్లు కట్టకూడదు

5 స్థలంలో మర్మ- ఉపమర్మ-మహామర్మ స్థానాలు ఎక్కడ ఉంటాయో గ్రహించటం సులభం ఎటంలో అడ్డగీతలు, నిలువు గీతలు క్రాసుగీతలు (కోణరేఖలు) కలిసే ప్రదేశాలు మర్మస్థానాలు కనుక అట్టి ప్రదేశాలలో ద్వారాలు, కిటికీలు, దూలాలు, స్తంభాలు పెట్టకూడదు పెడితే చాలా ఇబ్బందులకు గురి అవుతారు

**ఇల్లు కట్టకముందు ప్రహరీగోడలు నిర్మించరాదంటారు నిజమా?**

అది పొరపాటు ప్రహరి ముందుగా కట్టి, ఆ తరువాతే గృహ నిర్మాణం చేయాలని, అలా చేస్తే చుట్టూ ఉన్న పరిసరాల దుష్ట ప్రభావం ఉండదని ప్రామాణిక గ్రంథాలలో వివరించారు

**ఎటువంటి పరిసరాలు దుష్ఫలితాలిస్తాయి ?**

దక్షిణ-నైరుతి-పశ్చిమాలలో చెరువులు, బావులు, గోతులు పల్లపు గుంటలు, తూర్పు-ఈశాన్య- ఉత్తరాలలో ఎత్తైన గుట్టలు, కొండలు మెరక భూములు-స్థల సమీపంలో స్మశానం, గుడి, వధ్యశాల కాలుష్యాలు మొదలైనవి చెడు ఫలితాలను ఇస్తాయి

**ఏ దిశ నుండి ఇంటిలోకి ప్రవేశించాలి?**

వీధి నుండి ప్రహరి గేటు దాటి ఎదురుగా ఉన్న సింహద్వారం నుండి ఇంటిలోనికి ప్రవేశించాలి లేదా ఇంటి కుడిప్రక్కగల సింహద్వారం నుండి కూడా ప్రవేశించవచ్చు అది సవ్యగమనం అంతేగాని ఇంటి ఎడమ ప్రక్కనుండి గాని వెనుక నుండి గాని ప్రవేశించ కూడదు అయితే పెరటి వైపు వీధి, ద్వారం ఉంటే పెరటి గుమ్మం నుండి ప్రవేశించవచ్చు

**ప్రహరి గేటుకు సరిగా ఎదురుగా సింహద్వారం ఉండవచ్చా?**

ఉండవచ్చు ప్రహరిగేటు మధ్యబిందువు సింహద్వారం మధ్య బిందువు ఒకే సరళరేఖలో లేకుండా ఏర్పాటు చేసుకోవాలి

**వీధి దిశలు ప్రకారం ఏ దిశలలో సింహద్వారం ఉండాలి?**

1 తూర్పు వీధి ఉంటే, సింహద్వారం తూర్పున లేదా దక్షిణంలో ఉండాలి, ఉత్తరంలో ఉండరాదు 2 దక్షిణంలో వీధి ఉంటే, దక్షిణం లేదా పడమట సింహద్వారం ఉండాలి కాని, తూర్పున ఉండరాదు 3 పడమటి వీధికి పడమట గాని, ఉత్తరాన గాని సింహద్వారం ఉండాలి దక్షిణంలో ఉండరాదు 4 ఉత్తరాన వీధి ఉంటే ఉత్తరం, లేదా తూర్పున సింహద్వారం ఉండాలి, కాని, పడమర ఉండరాదు ఇలా ఉంటే సవ్యగమనం సాధ్యపడుతుంది

**ఉత్తర- ఈశాన్య-తూర్పు దిశలలో గోడలు తక్కువ ఎత్తు, తక్కువ మందం ఉండాలంటారు. నిజమా?**

అలా ఉంటే శాస్త్ర విరుద్ధం అన్ని దిశలలోనూ అన్ని గోడల ఎత్తు, మందంగా సమానంగా ఉండాలి ప్రామాణిక సూత్రాలకు విరుద్ధంగా ఇప్పటి కొత్తవాస్తు రచయితలు - ఈశాన్యం తేలిక, నైరుతిబరువు- అనే వింత సూత్రంతో దక్షిణ-నైరుతి-పడమట గోడలు ఎత్తు, మందం ఎక్కువ ఉండాలని తప్పుడు సలహాలిస్తున్నారు ఇలా ఉంటే ఇంటి బలం తగ్గుతుంది దోషం బాధిస్తుంది

ఈశాన్యంలో మెట్లు ఉండకూడదుగదా?

అది కొత్త రచయితల సొంత అభిప్రాయమే గాని శాస్త్రీయం కాదు మెట్లు ఏ దిశలలోనైనా ఉండవచ్చు దోషం లేదు

**దక్షిణ-పశ్చిమాలకు ఎక్కేవిధంగా, ఉత్తర-తూర్పులకు దిగేవిధంగా మెట్లు ఉండాలా?**

అవసరం లేదు ఈ సలహా కేవలం కొత్తవారిది మనకు సౌకర్యంగా ఉండే పద్ధతిలో మెట్లు నిర్మించాలి దిశలు, మూలలు ప్రసక్తేలేదు అవి దృష్టికిగాని ఇంటికి గాని ఇబ్బందికరంగా ఉండకూడదు

**దక్షిణంలో ఖాళీ లేకుండా ప్రహరిగోడను కలుపుకుని ఇల్లుకట్టవచ్చా?**

అది పెద్ద దోషం దక్షిణ-నైరుతి-పశ్చిమాలు మూతపడాలని ఆధునికులు శాస్త్రవిరుద్ధమైన సలహాలిస్తున్నారు అలా గృహం నిర్మిస్తే మహాదోషమని ప్రామాణికులు ఉద్ఘాటించారు

**దక్షిణ ఆగ్నేయం, పశ్చిమ వాయువ్యం నుండి ఈశాన్యం నడక చాలా మంచిదంటారు. వాస్తవమేనా?**

ఇది కూడా శాస్త్ర విరుద్ధం ఇదివరకుస వివరించినట్టు మూలలకు ఎదురుగా సింహద్వారం ఉంటే దోషం ఆధునికుల తప్పుడు సలహాలలో ఇదొకటి వాస్తు పదవిభజనలో సూచించిన స్థానాలలోనే ప్రవేశించటం అపసవ్యగమనం అవుతుంది

**మరి సింహద్వారం ఎక్కడ ఉండాలి?**

దిశలను అనుసరించి సింహద్వారం ఎక్కడ ఉండాలో వాస్తుపద పటం చూసి నిర్ణయించాలి

1 ఉత్తర దిశలలో వాయువ్యం నుండి ఈశాన్యం వరకు లెక్కించినప్పుడు 3-4 భాగాలలో అనగా పటంలో 27-28 పదాలలో

2 తూర్పు దిశలో- ఈశాన్యం నుంచి ఆగ్నేయం వైపు 3-4 భాగాలలో

3 దక్షిణంలో- ఆగ్నేయం నుంచి నైరుతి వైపు 4-6 భాగాలలో (12-14 పదాలు)

4 పడమటి దిశలో-నైరుతి నుండి వాయువ్యంగా 3-4 భాగాలలో (19-20 పదాలు) సింహద్వారం ఉండాలి

మయ వాస్తుప్రకారం అన్నిదిశలలోను మూల నుండి 4వ భాగంలో సింహద్వారం ఉండాలి వీటిని భల్లాట, ఇంద్ర,గృహక్షత పుష్పదంత పదాలని అంటారు ఇవి వరుసక్రమంలో ఉత్తరం తూర్పు-దక్షిణ-పడమటి దిశల సింహద్వార నిర్ణయాలకు వర్తిస్తాయి

**ఒకే దిశలో రెండు సింహద్వాలాలు ఉండవచ్చునా?**

ఏ దిశలోనైనా ప్రధానమైన సింహద్వారంపైన సూచించిన భాగాలలోనే ఉండాలి రెండవ ద్వారాన్ని ఉపద్వారం అంటారు ఈ ఉపద్వారం (1) ఉత్తర దిశలో 26-32 పదాలలో (2) తూర్పు దిశలో 2-7 పదాలతో (3) దక్షిణ దిశలో 10-15 పదాలలో (4) పడమట 18-23 పదాలలో ఏర్పాటు చేసుకోవచ్చు

**నాలుగు దిశలలోనూ ద్వారాలు పెడితే?**

దిశకొక ద్వారం చొప్పున నలుదిక్కులలో ద్వారాలు ఉంటే చాలా ప్రశస్తమని, శుభప్రదమని శాస్త్రాలలో చెప్పారు వీధి సింహద్వారం పెరటివైపు ఉపద్వారం ఉంటే మంచిది

**సింహద్వారం, నిర్ణయంలో ఏ సూత్రాలు పాటించాలి?**

1 రోడ్డు ఉన్నదిశకు ఎదురుగా నిర్మించాలి మూలలకు ఉండరాదు

2 సింహద్వారానికి ఎదురుగా స్తంభం,చెట్టు, కొండ, బావి, మెట్లు, గుడి, బండరాయి, బురద, కాల్వ, మొదలైన అవరోధాలు ఉండకూడదు అంతేగాక మరొకరి సింహద్వారం గాని పెరటి ద్వారం గాని ఉండకూడదు

3 ప్రహరి ద్వారం కంటె సింహద్వారం ఎక్కువ ఎత్తు, తక్కువ వెడల్పు ఉండాలి

4 సింహద్వారం ఉచ్చస్థానంలో ఉండాలి ఆవరణలోని నీరు లోనికి రాకూడదు

5 లోపలి ద్వారాల కంటే పెద్దదిగా ఉండాలి

**ద్వారానికి ఎదురుగాద్వారం ఉండాలా ?**

ఉండనవసరం లేదు ఉండకూడదను కూడా చెప్పారు అయితే సింహద్వారానికి ఎదురుగా పెరటి గుమ్మం ఉండవచ్చు

**తలుపులకు ఏకలపనైనా వాడవచ్చునా??**

టేకు, మద్ది, నేగిస, వేప, మామిడి మొదలైన కలపవాడవచ్చు ఒకే రకం కలప వాడితే ప్రశస్తం రెండు రకాలు మధ్యమం ఎక్కువ మిశ్రమాలు అరిష్టదాయకం తలుపులు మూసినా తెరచినా శబ్దం రాకూడదు, ముందుకు గాని వెనుకకుగాని వాటంతటా అవి పడిపోకుండా, సరిగా మూతపడాలి, తెరవబడాలి కిటికీలు కూడా ఇదే రీతిగా ఉండాలి తలుపుల ఎత్తు వెడల్పులు 9:5 నిష్పత్తిలో ఉంటే మంచిది

**ద్వారాలన్నీ సరి సంఖ్యలో ఉండాలా?**

ద్వారాలు, కిటికీలు, దూలాలు, స్తంభాలు వేటికవి 10-20-30 కాకుండా సరి సంఖ్యలో ఉండాలి

**వసారాలు తప్పని సరిగా ఉండాలా? ఎన్ని ఉండాలి?**

వసారాలు ఉంటే సుఖప్రదం నలుప్రక్కలా ఉంటే ఎంతో శ్రేయస్కరం ఒక వసారా వేయదలుచుకుంటే అది ఇంటికి ముందుభాగంలోనే ఉండాలి రెండు వసారాలు వేయదలుచుకుంటే ముందు-వెనుకలకు గాని, కుడి ఎడమలకు గాని, ముందువైపు ఒకటి కుడిపక్క ఒకటి గాని, ఉండవచ్చు అంతేగాని ముందుభాగంలో ఒకటి , ఎడమపక్క ఒకటి, అలాగే పెరటి వైపు ఒకటి, ఎడమ వైపు ఒకటి ఉండకూడదు మూడు వసారాలు అయితే ముందు వెనుకలకు, కుడిప్రక్కకు ఉండాలి ముందు భాగంలో రెండు వరండాలు ( డబుల్ వరండా) చాలా ప్రశస్తం

**ఇంటి గదులు ఏ విధంగా ఉండాలి?**

ముందుగా ఇల్లు కట్టదలచుకున్న ఇంటి పొడవు, వెడల్పుతో వైశాల్యం నిర్ణయించి, చుట్టూ 9 వ భాగం ఖాళీగా విడచి పొడవును మూడుభాగాలుగా చేయాలి వీధి సింహద్వారం ఉన్న ముందు భాగం దేవభాగం అవుతుంది పెరటిభాగం మానుష భాగం, మధ్యభాగం గంధర్వభాగం అవుతాయి ముందుగం దేవభాగంలో పూజగది, డ్రాయింగు రూము, చర్యగది ఉండాలి వెనుక మానుష భాగం-పెరటి భాగంలో వంటగది భోజనాల గది నిర్మించాలి మధ్యగంధర్వభాగంలో నివాసానికి, పడకకు చదువులకు గదులు ఏర్పాటు చేసుకోవాలి

**వంటగది ఆగ్నేయంలోనే ఉండాలి కదా?**

ఆగ్నేయంలోనే వంటగది ఉండాలి అన్న నియమం లేదు అది సాధారణ సూత్రం మాత్రమే ఉత్తరంలో గాని పడమటి గాని వీధి, సింహద్వారం ఉన్నప్పుడు మాత్రమే పెరటి వైపు మానుష భాగంలో వంటగది సాధ్యపడుతుంది తూర్పున గాని దక్షిణాన గాని వీధి, సింహద్వారం ఉన్నప్పుడు ఆగ్నేయం దేవ భాగం అవుతుంది కనుక మానుషభాగంలో పెరటివైపు వాయువ్యం లేదా నైరుతిలో వంటగది సాధ్యమవుతుంది

**వంటపొయ్యి ఎక్కడ అమర్చుకోవాలి?**

వంటగది ఏ మూలలో ఏర్పాటు చేసుకున్నప్పటకీ ఆ గదిలో తూర్పునకు ఎదురుగా నిల్చుని వంట చేయడానికి వీలుగా ఆగ్నేయం మూలకు పొయ్యి ఏర్పాటు చేసుకుని, గదిలో, తూర్పు ఈశాన్యాలలో నీట వాడకానికి సింకు నిర్మించుకోవచ్చు

**పూజగది ఈశాన్యంలోనే ఉండాలంటారు?**

తూర్పు- ఉత్తర సింహద్వారాల వారికి మాత్రమే ఈశాన్యం దేవభాగమై పూజగది నిర్మించడానికి వీలుపడుతుంది మిగిలిన వారికి ఆగ్నేయ వాయువ్యాలలో వీలవుతుంది ఏ మూలలోనైనా తూర్పుదిశకు ఎదురుగా కూర్చొని పూజ చేసే విధంగా దేవుని పటాలు ఏర్పాటు చేసుకోవాలి అంతేగాని కొందరు కొత్త వాస్తు రచయితలు సూచించిన విధంగా పడమటకు పటాలు పెట్టకూడదు

**దేవాలయాలలో పడమటి వైపు దైవ విగ్రహాలుంటాయి కదా?**

ఇల్లు దేవాలయం కాదు కదా? దేవాలయాలలో ఏ దేవునికి ఏ దిశకు అభిముఖంగా ఉండాలో దేవాలయ వాస్తులోనూ ఆగమశాస్త్రాలలోనూ వివరించారు అది గృహవాస్తుకు వర్తించదు

**తూర్పు ఈశాన్యాలలో బరువు ఉండకూడదు కనుక దేవునికి పీఠం, అరుగు నిర్మించరాదంటారు?**
ఆ అభిప్రాయం పొరబాటు. ఇది కొత్త రచయితల పలుకులు. తూర్పు ఈశాన్యాలలో ఎత్తైన, బరువైన అరుగులు కూడా ఇంటి వెలుపల గాని లోపలగాని నిర్మిస్తుంటారు. అదీ వాస్తు సమ్మతమే. పూజగదిలో కూడా పీఠం, అరుగు ఉంచవచ్చు.

**యజమాని పడకగది నైరుతిలోనే ఉండాలా?**
దేవ గాంధర్వ-మానుషభాగాలలో మధ్యభాగం అయిన గాంధర్వ భాగంలో నివాసపు గదులు ఉండాలి? కనుక ప్రతి ఇంట నైరుతిలోనే యజమాని పడక గది ఉంటాలన్న నియమం లేదు. సాధారణంగా దక్షిణంలో పడకగది నిర్మించవచ్చు. మధ్యభాగంలో వటాలు, వటకగదులు, పిల్లల గదులు నిర్మించాలి.

**ఉత్తర దిశకు తల ఉంచరాదా?**
ఉత్తరంలో తల వుంచి నిద్రించకూడదు. శయనించినప్పుడు కంటికి ఎదురుగా అవరోధం కలిగించేవి ఏవీ లేకుండా పడక ఏర్పాటు చేసుకోవాలి. తలదిండ్లు తూర్పు దక్షిణ పశ్చిమాలలో ఉంటవచ్చు.

**గోడలు ఎత్తు, మందం ఎలా ఉండాలి?**
ఇంటిలోని అన్నిగదులు గోడల ఎత్తు, మందం ఒకే తీరుగా ఉండాలి. దక్షిణ పశ్చిమాలలో ఎక్కువ ఎత్తు, ఎక్కువ మందం ఉండాలి. తూర్పు ఉత్తరాలలో తక్కువ ఉండాలి అనే కొత్త రచయితల అభిప్రాయం శాస్త్ర విరుద్ధం.
పునాది నుండి గోడలు కట్టుబడిలో చాలా జాగ్రత్త వహించాలి. గోడలు నలుమూలలో హెచ్చు తగ్గులు లేకుండా వంకరలు, ముందుకుగాని ఒరగకుండా నిర్మాణాం జరగాలి. ఒరిగినా, హెచ్చుతగ్గులున్నా ఆదోషాలు చాలా బాధిస్తాయి.

**అంతస్తుల నిర్మాణం ఎలా ఉండాలి?**
దిగువ ద్వారాలు, కిటికీలు ఎక్కడ ఉన్నాయో పై అంతస్తులో కూడా అదే భాగంలో ఉండాలి. అవసరమైతే దిగువ ద్వారం ఉన్నచోట పైన కిటికి, దిగువ కిటికి ఉన్నచోటపైన ద్వారం నిర్మించవచ్చు. దిగువ వంట, భోజనాల గది మిగిలిన గదుల కొలతలు పైన కూడా అదే విధంగా ఉన్నప్పటికీ, వాటిని వేరే విధంగా వాడుకోవచ్చు. అంతస్తులోని గోడలు ఎత్తు-దిగువగోడల ఎత్తులో 12వ భాగం తగ్గి ఉండాలి. ప్రతి అంతస్తుకు ఈ నియమం వర్తిస్తుంది.

**స్థలంలో ఎత్తు-పల్లాలు ఉంటే?**
గృహనిర్మాణానికి నిర్ణయించిన స్థలమంతా నేలమట్టం ఒకేవిధంగా చదునుగా ఉండాలి. ఆవరణలోని స్థలం కూడా చదునుగా ఉన్నా, దక్షిణ పశ్చిమాలు ఎత్తుగా తూర్పు ఉత్తరాలు పల్లంగా ఉన్నా మంచిది. ఇందుకు విరుద్ధంగా ఉంటే లెవెల్ చేయాలి. దక్షిణ నైరుతి పడమరలు పల్లంగాను, ఉత్తరం, ఈశాన్య తూర్పు ఎత్తు గాను ఉంటే దోషం కనుక చదును చేయాలి.

**నీటి వాటం ఎలా ఉండాలి?**
ఆవరణలోని నీరు ఈశాన్యం, తూర్పు, ఉత్తర దిశలుగా బయటకు పోవాలి. ఇది తూర్పు- ఉత్తరాలలోవీధులు ఉంటేనే సాధ్యమవుతుంది. పశ్చిమ-దక్షిణ వీధులు గలవారు తూముల ద్వారా ఈశాన్యంనుండి ఆగ్నేయ వాయువ్య దిశలుగా నీరు బయటకు పోయే విధంగా తూములు ఏర్పాటు చేసుకోవాలి.నైరుతి నుండి నీరు బయటకుపోవడం దోషం.

**వాటర్ టాంక్ ఎక్కడపెట్టాలి?**
మొదట అంతస్తులో వాయువ్యదిశలో వాటర్‌టాంక్ ఏర్పాటు చేసుకోవటం మంచిది. నైరుతిలో మాత్రం ఉంచకూడదు. వాటర్ టాంక్‌కోసం ఈశాన్యందిశపై కప్పు తగ్గించడం కూడా శాస్త్ర సమ్మతం కాదు.

**సెప్టిక్‌టాంకు అవసరమైతే?**
ఉత్తరం, ఉత్తరవా యవ్యం, తూర్పు ఆగ్నేయాలలో సెప్టిక్ టాంక్ నిర్మించవచ్చు. దక్షిణ, నైరుతి పశ్చిమాలలో నిర్మించరాదు.

**వీధిశూల ఉంటే దోషమా?**
సాధారణంగా ఇళ్లు రోడ్లుకు ఇరుప్రక్కలుగా ఉంటాయి. అయితే అరుదుగా కొన్నిచోట్ల రోడ్లుకు ఎదురుగా, బాటసారులకు కనిపించేటట్టు ఇళ్లు ఉంటే వీధిశూల ఏర్పడి ఇబ్బందులు కలిగిస్తుంది. ఆ యింటికి బాటసారుల దృష్టి దోషం ఏర్పడుతుంది. ఈ దోషపరిహారానికి వీధికి ఎదురుగా ఇంటి ముందు ఒక అడ్డుగోడ, వినాయక విగ్రహం ఏర్పాటు చేస్తారు. కొందరు చుట్టిల్లు నిర్మిస్తారు.

**చుట్టు ఇల్లు అంటే?**
12 అడుగులు లేదా 9 అడుగులు ప్రమాణంతో ఇంటికి దక్షిణభాగంలో చక్రాకారంగా నిర్మించే ఇంటిని చుట్టిల్లు అంటారు. ఇది ఎంత మాత్రం 12 అడుగులకు మించరాదు. ఈ చుట్టిల్లు వాస్తుదోషాలను హరిస్తుందని పేర్కొన్నారు. ఇది నిర్మించిన మూలలను అనుసరించి వంటగది, పడకగది సామానుల గది, అతిథుల గది, కావలివారిగదిగా ఉపయోగించుకోవచ్చును.

**ఇల్లు కట్టిన తరువాత దానిని పెంచవచ్చునా?**
గృహయజమానికి అనుకూలమైన వైశాల్యంతో అనగా పొడవు వెడల్పులతో ముందుగృహనిర్మాణం జరుగుతుంది. తరువాత ఆ యింటిని పెంచితే పొడవు వెడల్పులు వైశాల్యం కొలతలు పెరుగుతాయి. గర్భప్రమాణం మారకుండా పెంచిన కొలతలతో ఏర్పడిన వైశాల్యం కూడా యజమానికి అనుకూలించాలి.

**ఒకే ఆవరణలో ఎక్కువ ఇల్లుకట్టవచ్చునా?**
విశాలమైన ఆవరణలో ఎక్కువ ఇల్లు కట్టవచ్చు గాని కొన్ని సూత్రాలు పాటించాలి. ముందుగా దక్షిణంలోనూ పశ్చిమంలోనూ గృహాలు నిర్మించిన తరువాతనే ఉత్తరంలోనూ తూర్పులోను ఇళ్ళు కట్టాలి గాని ఇందుకు విరుద్ధంగా అంటే ముందు తూర్పు ఉత్తరాలలో కట్టకూడదు. భవన సముదాయంలో దక్షిణ పశ్చిమాలలో తప్పనిసరిగా గృహాలు ఉండి తీరాలి. కనుక విశాలమైన ఆవరణలో గృహ నిర్మాణం తలపెడితే ముందు దక్షిణంలో తదుపరి పశ్చిమంలో ఇల్లు కట్టాలి.
ఆవరణలో నిర్మించిన రెండు గృహాలు ఒకేపొరులో ఉండాలి. హెచ్చు తగ్గులుంటే దోషప్రదం.

**సింహద్వారాలు ఎదురెదురుగా ఉండవచ్చునా?**
ఉత్తర-దక్షిణాలలో గాని తూర్పు-పడమరలలో గాని రెండు గృహాలు ఎదురెదురుగా నిర్మించినప్పుడు వాటి సింహద్వారాలు ఎదురెదురుగా ఉండకూడదు. అయితే ఈ రెండు ఇళ్ళ మధ్య ద్వారాల ఎత్తుకు రెండురెట్ల స్థలం ఖాళీగా ఉంటే దోషం లేదు. ఉత్తరంలో ఇల్లుకట్టక దక్షిణంలో మరో ఇల్లుకట్టడటందోష ప్రదం. ఒకే ఆవరణలో పడమటి సింహద్వారాలతో రెండు గృహాలు నిర్మించకూడదు.

**ఒకేగోడను కలుపుకుని రెండు ఇళ్లు కట్టవచ్చునా?**
ఒకేగోడతో రెండు గృహాలు నిర్మించటం దోషప్రదం. ఎందుకంటే రెండు ఇళ్ళ మధ్య ఖాళీ స్థలం తప్పకుండా ఉండాలి. సరిహద్దు గోడపై నిర్మాణం చాలాదోషం. అయితే రెండు కంటె ఎక్కువ గృహాలు నిర్మించినప్పుడు ఈ దోషం వర్తించదు. అది గృహసముదాయం అవుతుంది.
దక్షిణ సరిహద్దునుండి ఇల్లు కట్టినా, దక్షిణ సరిహద్దున సింహద్వారం పెట్టినా అది మహాదోషం. కొందరు దక్షిణనైరుతి మూతపడితే మంచిదని ఖాళీ ఉంచకుండా గృహం నిర్మిస్తారు. ఇది పూర్తిగా శాస్త్ర విరుద్ధం, హానికరం.

**ఒకయింటికి సింహద్వారాలు ఎన్ని ఉండవచ్చు.**
ఒకటి, రెండు లేదా నాలుగు ద్వారాలు ఉండవచ్చు. మూడుబయటి ద్వారాలు ఉండరాదు.
(1) తూర్పునమాత్రమే ఒక సింహద్వారం, ముందువసారా ఉంటే అది ధ్యానశాల అంటారు దీనిని పడమటి ఇల్లు అంటారు. దక్షిణంలో మాత్రమే సింహద్వారం, వసారా ఉంటే దానిని(2) జయశాల అంటారు. ఇది ఉత్తరపు ఇల్లు.
(3) పడమట మాత్రమే సింహద్వారం, వసారా ఉంటే ఆ యింటిని జారశాల అంటారు.
(4). ఉత్తరంలో మాత్రమే సింహద్వారం, వసారా ఉంటే దానిని దుర్ముఖశాల అంటారు.
మొదటిది తూర్పు ఇల్లు, రెండవది దక్షిణపు ఇల్లు. ఇలా పడమట గాని ఉత్తరానగాని ఒక ద్వారం మాత్రమే ఉంటే చాలా హానికరం. కేవలం తూర్పు దక్షిణాలలో మాత్రమే ఉంటే చాలా హానికరం. తూర్పు దక్షిణాలలో మాత్రమే ఏకద్వారం శుభప్రదం.

**రెండు సింహద్వారాలు పెడితే ఏ దిశలలో ఉండాలి?**
1.తూర్పున ఒకటి, దక్షిణంలోమరో సింహద్వారం ఉండవచ్చు. వసారాలు కూడా ఉంటే దానిని నందశాల అంటారు . నందశాల శుభప్రదం.
2.తూర్పుపడమరలలో చెరొక సింహద్వారం ఉండవచ్చు. ఈ రెండు దిశలలో వసారాలు కూడా ఉంటే ఆ యింటిని శాంతశాల అంటారు. చాలా మంచిది.
3. తూర్పున ఒకటి ఉత్తరంలో మరొకటి సింహద్వారాలుంటే హానికరం. దోషప్రదం. ఆ యింటిని క్రూరశాల అంటారు. ఈ నియమం తెలియనివారు తూర్పు ఉత్తరాలలో సింహద్వాలాలుంటే మేలని చెబుతారు. అది శాస్త్ర విరుద్ధం.
4.దక్షిణ- ఉత్తరాలలో సింహద్వారాలుంటే శుభప్రదం. వసారాలు కూడా ఉంటే ఆ యింటిని సుపక్షశాల అంటారు.
5. దక్షిణంలో ఒకటి, పడమట ఇంకొక, సింహద్వారం కూడా ఉండవచ్చు. వసారాలు కూడా ఉన్న ఆ యింటిని మనోరమశాల అంటారు. ఇది శుభప్రదం.
6. పడమటి సింహద్వారం, ఉత్తరాన మరోద్వారం ఉండరాదు. ఆ దిశలలో వసారాలు కూడా ఉన్న ఇంటిని క్షయశాల అంటారు. హానికరం .
7.నలుదిక్కులలో నాలుగు సింహద్వారాలు, వసారాలు కూడా ఉంటే ఎంతో

శ్రేయస్కరం. దానిని విజ యశాల అంటారు.

**వసారాలతో పాలు మూడు సింహద్వారాలు ఉండవచ్చునా?**

1). కొన్ని దిశలలో ఉండ వచ్చు. ప్రదాన సింహద్వాలం తూర్పున ఉండాలి. దక్షిణంలోనూ, పటమట రెండు ప్రక్కద్వారాలు, ఈ మూడు దిశలలో వసారాలు ఉంటే శుభప్రదం.

2). తూర్పునప్రధాన సింహద్వారం, వసారా, దక్షిణ ఉత్తరాలలో ప్రక్కద్వారాలు, వసారాలు గల ఇల్లు శుభదాయకం. దానిని ధనదశాల అంటారు.

3). తూర్పున ప్రధాన సింహద్వారం, వసారా, ఉత్తర పశ్చిమాలలో ప్రక్క ద్వారాలు, వసారాలు గా ఇల్లు హానికరం. అది ఆక్రందశాల.

4). దక్షిణదిశప్రధాన సింహద్వారం దాని ముందు వసారా, ఉత్తర పశ్చిమాలలో ప్రక్క ద్వారాలు, వసారాలు గల ఇంటిని విపుల శాల అంటారు. అది క్షేమకరం.

**వీటిలోప్రధాన సింహద్వారం వేపు రెండు వసారాలు వేయువచ్చా ?**

ధ్యాన, ఉంద శాంత, సుముఖ, ధనద, విజయశాలలకు సింహ ద్వారం ముందు రెండు వసారాలు ఉంటే ఎంతో మంచిది. వాటికి వరుసక్రమంలో రమ్య-శ్రీధర-ముదిత-వర్ధమాన-సునాఖ, సమృద్ధశాలలుగా పేర్కొన్నారు. క్రూర, ఆక్రంద శాలలకు సింహద్వారం ముందు రెంటు వసారాలు ఉంటే అరిష్ట అరిష్టదాయకం. వాటిని కరాళ, ధ్వాంక్ష శాలలు అంటారు.

**తలుపులు లేని ద్వారాలు ఉండరాదా?**

గృహ సదుపాయాలకు వీలుగా తలుపులు గాని ద్వారాలుగాని చేసి వేకుండా నక్షకకు ఏర్పాకు చేసుకొవచ్చు. కాని అట్టిచోటపై భాగంలో ధనురాకారం (ఆర్చి)లో నిర్మాణం జరగాలి. ప్రక్కభాగాలలో కిటికిలు ఉండాలి.

గృహయజమానికి ఏ దిశలో ఇల్లు అనుకూలం?

గృహయజమాని పేరులోని మొదటి అక్షరం ఏ వర్గుకు చెందినదో గమనించి ఆ వర్గుకు చెందిన దిశలో గృహనిర్మించాలి.

**నామాక్షరాలకు చెందిన వర్గులేమిటి?**

అక్షరాలల్నీ ఎనిమిది వర్గులుగా విభజించారు. అ-క-చ-ట-త-ప-య-శ అని ఎనిమిది వర్గులు.

**'అ' వర్గ ఏ దిశకు వర్తిస్తుంది? ఎవరికి అనుకూలించదు?**

''అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - ఋ - ఎ - ఏ - ఐ - ఒ - ఓ - ఔ '' అనేవి అచ్చులు. ఇవి ' అ' వర్గుకు చెందిన అక్షరాలు. పేరులో మొదటి అక్షరం ఈ వర్గలో ఉంటే వారికి తూర్పు దిశ అనుకూలం. పటమటి దిశ సింహాద్వారంతో తూర్పు ఇల్లు నిర్మిం ఇల్లు నిర్మించాలి వీరికి తూర్పు ద్వారాలు గా పడమటి ఇల్లు ప్రతికూలం.

**'క' వర్గ వారికి ఏ దిశలో ఇల్లు అనుకూలం?**

''క - ఖ - గ - ఘ - ఙ'' అనేవి క వర్గులోని అక్షరాలు. ఇది ఆగ్నేయ దిశకు వర్తిస్తుంది. వీరికి వాయువ్యమునకు వర్తించే 'ప' వర్గ శత్రు ఎర్గు. మొదటి అక్షరం క వర్గులో ఉన్నవారికి 'దక్షిణపు ఇల్లు అనుకూలం.

**'చ' వర్గకు ఏది అనుకూలం ?**

''చ - ఛ - జ - ఝ - ఞ '' అనేవి చ వర్గంలోని అక్షరాలు. దక్షిణ దిశకు వర్తిస్తుంది. కనుక చ వర్గవారు ఉత్తర సింహద్వారంతో దక్షిణపు ఇల్లు నిర్మించుకోవచ్చు.

**'ట' వర్గ వారికి ఏ దిశ ఇల్లు శుభప్రదం?**

ట-ద -డ -ఢ-ణ అనేవి ట వర్గనకు '' త-ధ-ద-ధ-న' అనేవి 'త ' వర్గనకు చెందిన అక్షరాలు. ఈ వర్గల వారు తూర్పు సింహద్వారయో పడమటి ఇల్లు కట్టుకోవచ్చు. ట -నైరుతి త- పటమర.

**మిగిలిన వర్గల వారికి ?**

'' ష - ఫ - బ - భ - మ'' ఇవి ప వర్గు. య-ర-ల-వ అనేవి య వర్గ శ-ష-స-హ అనేవి శ వర్గుకు పటమటి ద్వారంతో తూర్పు ఇల్లు అనుకూలం.

**ఇతర దిశలు అనుకూలించవా ?**

ప్రతి వర్గుకు అయిదవది శత్రువర్గు. కనుక శత్రువర్గ దిశలలో తప్ప ఇతర దిశలలో ఇల్లు నిర్మించవచ్చు. నామరాశులకు అనకూలమైన దిశలలో కూడా గృహనిర్మాణం చేయవచ్చు.

**నామరాశులంటే ఏమిటి?**

రాశులకు వర్తించే దిశలు-మూలలు

1. తూర్పు : మేషం-వృషభం 2. ఆగ్నేయం : మిధునం
3. దక్షిణం : కర్కాటకం-సింహం 4. నైరుతి : కన్య
5. పడమర : తుల-వృశ్చికం 6. వాయువ్యం : ధనుస్సు
7. ఉత్తరం : మకరం-కుంభం 8. ఈశాన్యం : మీనం

మూలలకు ఎదురుగా సింహద్వారం రాకుండా అనుకూల దిశలలో గృహం నిర్మించాలి.

**సింహద్వారం ప్రకారం దిశలు నిర్ణయించరా?**

వర్గుకు వర్తించే దిశను అనుసరించి గృహ నిర్మించాలి. దానికి ఎదుటి దిశగా సింహద్వారం ఉండాలి. అంటే ' అ ' వర్గ వారికి తూర్పున ఇల్లు పటమటి సింహ ద్వారం ; 'చ' వర్గవారికి దక్షిణంలో ఇల్లు ఉత్తర సింహద్వారం ; 'త' వర్గవారికి పటమటి ఇల్లు తూర్పు సింహద్వారం; 'య' వర్గవారికి ఉత్తరంలో ఇల్లు దక్షిణ సింహద్వారం ఉండాలి.

అయా దిశలకు వర్తించే ''అయము'' కొలతలతో గృహ నిర్మాణం జరగాలి.

**'' ఆయం'' అంటే?**

ఇంటి పొడవు-వెడల్పులను గుణించగా వచ్చిన వైశాల్యం- పదం అంటారు. ఈ వైశాల్యం లేదా పదాన్ని 9 చే గుణించి 8 చే భాగించి శేషం ఎంత వచ్చిందో గమనించాలి. శేషసంఖ్యను బట్టి ఆయాలు ఏర్పడతాయి.

శేషం 1. ధ్వజాయం 2. ధూమాయం 3. సింహాయం 4. శ్వానాయం 5. వృషభాయం 6. ఖరాయం 7. గజాయం 8. కాకాయం.

**ఆ యాలవల్ల ఏమి ప్రయోజనం?**

ఏ దిశలో ఏ అయంతో (అనగా పొడవు - వెడల్పులతో) గృహం నిర్మించాలో నిర్ణయించవచ్చు. తూర్పు ఇల్లు ధ్వజాయంతో, దక్షిణపు ఇల్లు సింహాయంతో పడమటి ఇల్లు వృషభా యంతో ఉత్తరపు ఇంటిని గజాయంతో నిర్మించాలి.

**మిగిలిన ఆయాలు?**

ధూమాయం- ఆగ్నేయానికి, శ్వానాయం - నైరుతిని ఖరాయం - వాయువ్యానికి, కాకాయం - ఈశాన్యానికి వర్తిస్తాయి. ఇవి మూలలకు చెందిన ఆయాలు. నివాస యోగ్యమైన ఇళ్ళకు ఇవి పనికి రావు.

ఈ ఆయాలు- కొలతలు కేవలం గృహ నిర్మాణానికే కాకుండా ద్వారాలు, కిటికీలు, మంచాలు, టేబుళ్ళు, పీటలు, కుర్చీలు, పాత్రలు, పరికరాలకు కూడా అన్వయిస్తాయి.

**ఒక ఆయం వేరొక దిశకు పనికిరాదా?**

ప్రతికూల దిశలకు పనిక రావు. ఉదాహరణలు తూర్పు ఇంటికి ధ్వజాయం అనుకూలమైతే, పడమటి ఇంటికి ప్రతికూలం. అదే విధంగా దక్షిణగృహానికి గజాయం పనికిరాదు. ఉత్తరపు ఇంటికి సింహాయం పనికిరాదు. తూర్పు ఇంటికి వృషభాయం పనికిరాదు.

**తూర్పు ఇల్లు కట్టుకోవచ్చా?**

'' అ -క-చ-ట' వర్గల వారు పటమటి సింహద్వారంతో తూర్పున ధ్వజాయం కొలతలతో ఇల్లు కట్టుకోవచ్చు. పటమట ఎక్కువ ఖాళీ స్థలం ఉండాలి. వృషభ -మిధున తులా-కుంభ-ధనూరాశుల వారికి కూడా ఇది అనుకూలమే. కార్తిక మార్గశిర మాఘమాసాలలో గృహ నిర్మాణం మొదలు పెట్టాలి.

**తూర్పు- ఉత్తరాలలో ఎక్కువ ఖాళీ ఉండాలి కదా?**

కొత్త వాస్తు రచయితకు కొందరు ప్రామాణిక వాస్తు శాస్త్రాలకు విరుద్ధంగా రచనలు సాగిస్తూ ప్రజలను తప్పుదారి పట్టిస్తున్నారు. వీధి తూర్పునగాని ఉత్తరానగాని ఉన్నప్పుడు ఆ దిశలలో ఎక్కువ ఖాళీ స్థలం ఉండవచ్చు. ఇది అన్ని దిశలకూ వర్తించదు. ఇంటి ఎత్తును అనుసరించి దిశలలో ఖాళీ ఉండవలసిన స్థలం నిర్ణయించాలి. ఇల్లు ఎంత ఉందో అంతస్థలం తూర్పున, అంతకు రెండు రెట్లు ఉత్తరాన, మూడు రెట్లు పడమట ఖాళీ స్థలం ఉండాలని దక్షిణంలో ఎంత ఖాళీ స్థలమైనా ఉండవచ్చని ప్రామాణిక గ్రంధాలు స్పష్టం చేశాయి.

**దక్షిణపు ఇల్లు ఎవరికి అనుకూలం?**

చ వర్గులవారికి మేష, వృషభ, కర్కాటక, సింహ, వృశ్చిక, కుంభ, మీనరాశులవారు సింహాయం లేదా ధ్వజాయం కొలతలలో ఉత్తర సింహద్వారంగా దక్షిణపు ఇల్లు కట్టుకోవచ్చు. య వర్గువారికి ప్రతికూలం. గజాయం పనికిరాదు. చైత్ర, వైశాఖ, మార్గశిర, మాఘ, ఫాల్గుణాలలో గృహకరంభం అనుకూలరి.

**పడమటి ఇల్లు ఎవరు కట్టుకోవచ్చు?**

త-య-శ- వర్గుల వారు, మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనూ, మీన రాశులవారు వృషభాయపు కొలతలు గాని, గజాయంతోగాని తూర్పు సింహద్వారంతో పటమటి దిక్కువ ఇల్లు కట్టాలి. చైత్ర వైశాఖ, శ్రావణ, ఫాల్గుణ మాసాలలో గృహ నిర్మాణం శుభప్రదం. ఆ వర్గుకు పటమటి ఇల్లు పనికిరాదు. వాయువ్యం లేదా నైరుతితో వంటగది ఉండాలి.

**ఉత్తరపు ఇల్లు ఎవరికి మంచిది?**

య-శ-ట-త-వ వర్గుల వారికి వృషభ, మిధున, కర్కాటక కన్యా మంకర రాశులవారికి ఉత్తరపు ఇల్లు అనుకూలం. గజాయం లేదా ధ్వజాయం కొలతలు నిర్ణయించి, దక్షిణదిశకు సింహద్వారం ఏర్పరిచి, దక్షిణంలో ఎక్కువ ఖాళీ స్థలం విడిచి శ్రావణ కార్తీక మాసాలలో గృహారంభం చేయవచ్చు వాయువ్యంలో వంటగది ఉండాలి.

**గృహారంభానికి మాస నియమం పాటించాలా?**

గృహారంభ సమయంలో వాస్తు పూజ అవసరం. వాస్తు పురుషుని సంచార దిశలను అనుసరించి ఏ అనుకూల మాసాలలో గృహారంభం చేయాలో నిర్ణ యించాలి. వాస్తు పురుషుని దృష్టి, పాదాలుగా దిశలలో ఆయామాసాలలో సింహద్వారాలు పెట్టాలి.

**వాస్తుపురుషుడు ఎవరు?**

గృహం నిర్మించదలచిన స్థలాన్ని ఒక పురుషుని ఆకారంగా ఊహించాలి. శిరస్సు నుండి పాదాల వరకు అవయువాలు నిర్ణయించడం వాస్తు సంప్రదాయం. వాస్తుపద విభజనలలో ఈశాన్యం శిరస్సు. నైరుతి పాదాలుగా నిర్ణయించారు. ఇది స్థిరవాస్తు. అయితే మూడు నెలలు కొక సారి ఒకొక్క దిశలో సంచరించడం, ఎడమప్రక్కగా శయనించడం జరుగుతుంది. దీనిని చరవాస్తు అంటారు. అప్పుడు శిరస్సుగల దిశ మారుతుంది.

**ఏ మాసాలలో శిరోదిశమారుతుంది?**

1) భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసాలలో తూర్పున శిరస్సు దక్షిణ దిశ దృష్టి, పడమట పాదాలు ఉంటాయి. కనుక తూర్పున ఇల్లు, పడమట సింహద్వారం లేదా ఉత్తరంలో ఇల్లు, దక్షిణ సింహద్వారం నిర్మించవచ్చు.

2 . మార్గ శిర, పుష్య, మాఘమాసాలలో దక్షిణ శిరస్సు పడమట దృష్టి, ఉత్తరాన పాదాలు ఉంటాయి. కనుక ఈ మాసాలలో ఉత్తర సింహద్వారంతో దక్షిణపు ఇల్లు పశ్చిమ సింహద్వారంతో తూర్పు ఇల్లు నిర్మించవచ్చు.

3. ఫాల్గుణ చైత్ర వైశాఖ మాసాలలో పడమట శిరస్సు ఉత్తరాన దృష్టి, తూర్పున పాదాలు ఉంటాయి. కనుక ఈ నెలలో తూర్పు సింహద్వారంతో పటమట ఇల్లు, ఉత్తర సింహద్వారంతో దక్షిణపు ఇల్లు ప్రారంభించవచ్చు.

4. జేష్ఠ ఆషాడ శ్రావణ మాసాలలో ఉత్తరాన శిరస్సు, తూర్పు దృష్టి, దక్షిణాన పాదాలు ఉంటాయి. కనుక దక్షిణ సింహద్వారంతో ఉత్తరపు ఇల్లు తూర్పు ద్వారంతో పటమటి ఇల్లు నిర్మించవచ్చు.

వాస్తుపురుషుని దృష్టి, పాదాలుగా దిశలలో ఇల్లు కట్టరాదు. ఆ దిశలలో సింహద్వారాలు పెట్టి ఎదుటి దిశలలో అనగా శిరస్సు, వెన్నుగా దిశలలో గృహనిర్మాణం ప్రారంభించాలి.

**ఇంటిలో ఎటువంటి చెట్లు ఉండవచ్చు?**

ఇంటిలో మల్లి, చామంతి, జాజి, మందారం, నంది వర్ధనం, కనకాంబరం మొదలైపూల మొక్కలు, మరువం, దవనం, తులసి పెంచవచ్చు. వేప, కరివేప, మామిడి, పనస, నారింజ, నిమ్మ, ఉసరిక, ద్రాక్ష, కొబ్బరి, దానిమ్మ చెట్లు ఉండవచ్చును. పాలు కారేవి, ముళ్లుగలవి, కాలిన చెట్లు ఉండరాదు. అరటి మొక్క ఒక్కటి మాత్రం పెంచవచ్చు. మొక్కలలో తులసి, చెట్లలో వేప చాలా ప్రశస్తం.

**ఇంటిలో తులసి కోట ఎక్కడ ఉండాలి?**

పెరడులో సింహద్వారానికి ఎదురుగా, వంటయింటి కిటికీ ఎదురుగా తులసి కోట ఉంటే మంచిది.

**వరండాలకు కూడా అయువు కొలతలు పాటించాలా?**

వరండాలకు, గృహ సౌందర్యం కోసం నిర్మించే పోర్టికో మొదలైన వాటికి ఆయాలు పాటించనక్కరలేదు.

**ఇంటి మధ్యభాగంలో ఖాళీ ఉండవచ్చునా?**

మండువా ఇళ్లలో మధ్యభాగం ఖాళీగా ఉంటుంది. పైకప్పు ఉండదు. దీనిని చత్వర గృహం అంటారు. అన్నిటి కంటే ఇది ప్రశస్తమయినది.

**ఇల్లు అద్దెకు ఇస్తే వాస్తు దోషాలు వర్తించవా?**

నివసించినా, ఖాళీగా ఉంచినా, అద్దెకు ఇచ్చినా సరే వాస్తు దోషాలు గృహయ/మానిని బాధిస్తాయి. అద్దెకు ఉన్నవారు ఇంటిలో చేసే పుణ్యకార్యాల శుభఫలితం గృహ యజమానికే దక్కుతుంది. అందుకే అందరికీ చిన్న కుటీరమైనా, గుడిసె అయినా స్వంత ఇల్లు అనేది ఉండాలనీ, అలా ఉన్నప్పుడే వారు అచరించే పుణ్యకారాలు శభఫలం సిద్ధిస్తుందని వాస్తు శాస్త్రాలు వక్కాణించాయి.

**ఏది గొప్పది- గృహబలమా గ్రహబలమా?**

రెండూ సమానమే... వాస్తు దోషాలు ఆ దోషాల చెడు ఫలిస్తాయి. అలాగే గ్రహదోషాలు ఆయా గ్రహస్వభావాల ప్రకారం బాధిస్తాయి. గృహదోషం లేక పోయినా గ్రహదోషం ఉంటే అది వేధిస్తుంది. అదే విధంగా గ్రహ దోషం లేకపోయినా గృహదోషం బాధిస్తుంది. ఒకదానికొకటి సంబంధం లేదు. దేని ప్రభావం దానిదే.

**గృహదోష ప్రభావం ఎంత కాలం ఉంటుంది ?**

1 . ఆర్థిక సమస్యలకు, నష్టాలకు, అస్తులకు సంబంధించి కష్ట నష్టాలకు కారణమైన దోషాల ప్రభావం 9 సంవత్సరాల వరకు ఉండవచ్చు.

2. అన్ని విధాలా కీడు కలిగించే దోషాలు ప్రభావం 8 సంవత్సరాల వరకు ఉంటుంది.

3. గృహ యజమానిని బాధించే దోషాల ప్రభావం 6 సంవత్సరా వరకు పీడించగావు.

4. పిల్లలకు కీడు కలిగించే దోషాలు నాలుగేళ్లవరకు బాధిస్తాయి.

5. మిగిలిన సాధారణ స్వల్ప దోషాలు ప్రతికూల ఫలితాలు 15 దినాలు నుండి ఏడాదిలోపుగా కనిపిస్తాయి. 15 దినాల నుండి ఏడాదిలోపుగా కనిపిస్తాయి.

6. తొమ్మిదేళ్ళ తరువాత వాస్తు దోషాలు బాధించవు. పదేళ్ళ పై బడిన పాత ఇళ్ళకు దోషాలు వర్తించవు.

**అతి ముఖ్యంగా గమనించదగ్గ అంశాలేమిటి?**

భూమి బలం, ఆకారం, దిక్కులు లోపించకుండా ఉన్న స్థలం ఎంపిక, అనుకూల దిశలు-అయాలలో నిర్మాణం సింహద్వారం ఉండవలసిన చోటు, ప్లాను వేయునప్పుడు వాస్తుపదాలలలోని మర్మ స్థానాలకు ద్వారం, స్తంభం, కిటికీ మొదలైన వేధలు రాకుండా జాగ్రత్త వహించడం, నలుదిశలలోనూ 9వ భాగం ఖాళీగా విడవడం దేవ, గాంధర్వ, మానుష భాగాలలో నిర్దేశించిన గదులు నిర్మించటం, నీటి వాటం, వీధి శూల, ద్వార శూల గమనించటం మొదలైనవి ముఖ్యంగా పరిశీలించాలి. అన్నిటి కంటె ముఖ్యమైన విషయం ఏమిటంటే ప్రామాణిక వాస్తుసూత్రాలకు విరుద్ధంగా కొత్తగా వెలువడుతున్న కొన్నివాస్తురచనలు వాస్తవమని నమ్మి తప్పటడుగులు వేయకుండా జాగ్రత్తపడాలి.

**అలాంటి వాస్తు విరుద్ధమైన అంశాలలో ముఖ్యమైనవేమిటి?**

1. దక్షిణ-పశ్చిమ స్థలాలు పనికిరావు అనడం ;

2. దక్షిణ-నైరుతులు మూతబడడానికి, దక్షిణ సరిహద్దు నుండి ఇల్లు కట్టాలని, దక్షిణ పశ్చిమాలలో ఎక్కువ ఖాళీగా ఉండరాదని చెప్పడం.

3. ఉత్తరం, తూర్పు, ఈశాన్యాలలో గృహ నిర్మాణం పనికి రాదనడం.

4. మూలలో సింహద్వారాలు పెట్టాలని చెప్పటం.

5. దక్షిణ-పశ్చిమ-నైరుతిలలో గోడల ఎత్తు, మందం ఎక్కువగా ఉండాలని చెప్పటం.

6. ప్రతి ఇంటికి ఈశాన్యంలో గేటు, సింహద్వారం ఉండాలని ప్రతి ఇంటిలోను ఉత్తరం, తూర్పు ఎక్కువ ఖాళీగ ఉండాలని సూచించటం.

7. తూర్పు ఈశాన్య ఉత్తరాలలో మెట్లు ఉండరాదనడం. ఈ దిశలలో గోడల ఎత్తు, మందం తక్కువ ఉండాలని చెప్పటం.

8. వాస్తు పదాలు, ఆయాదుల గణితాలు, చూడనక్కర లేదని వాదించటం.

9. తూర్పు- ఉత్తరపు గోడలకు ఆన్చి వంట అరుగు నిర్మించరాదనడం.

10. దేవుని పటాలు, విగ్రహాలు పడమటకు ఉండాలనటం. ఇంకా ఎన్నో శాస్త్ర విరుద్ధమైన రచనలు చేస్తున్నారు.

**నైరుతిలో బరువు ఉండాలంటారు, నిజమేనా?**

బరువైన సామగ్రులు, ఆయుధాలు, యంత్రాదులు నైరుతి గదిలో ఉండాలని ప్రామాణికులు చెప్పారు. గాని నైరుతి గోడలు ఎత్తు, మందం ఎక్కువ ఉండాలని గాని నైరుతి లోని గదులు ఎత్తుగా ఉండాలని గాని చెప్పలేదు.

**నగలు, నగదు బీరువాలు ఎక్కడ ఉండాలి ?**

ఉత్తరపు గదిలో-దక్షిణపు గోడను ఆన్చి ఉత్తర దిశకు తలుపులు తెరిచే విధంగా నగలు, బీరువాలు పెట్టుకోవచ్చును. వ్యాపార స్థలాలలో కూడా ఉత్తరాభి ముఖంగా నగదు పెట్టెలు ఉంచటం మంచిది.



